# ఆంధ్రసాహిత్య పరిషత్తు

స్థాపకులు

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు

ఉద్ధారకులు

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,

(జమీందారు, ఉయ్యూరు యెస్టేటు,)

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

## Journal of the Telugu Academy

## KAKINADA.

సంవత్సరము చందా రు 3—0—0

సంపుటము ౪౯ శార్వరి-చైత్ర వైశాఖములు సంచిక ౧
Vol 49 Part 1

## విషయసూచిక

# స్వవిషయము

ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రికకు నేఁటికి నలుబదియెనిమిది వత్స రములు గడచి నలుబది తొమ్మిదవవత్సరము ప్రారంభమయినది. గ్రాంథికాంధ్రభాషను నిలువఁబెట్టుటకు కృషిచేయు సంస్థలలో నింత కాలమువఱకు నిలుద్రొక్కుకొనియున్న సంస్థ యిదియొక్కటియే యనుట నిర్వివాదమైన సత్యము. ఆఘాతము లెన్నివచ్చినను ప్రజా దర మెంతసడలినను, చెదరకుండ నిలిచినసంస్థ యిదియే యనవచ్చును. ఏవిషయమున రచన సాగించినను సలక్షణమైన భాషనే పాటింప వలయు నను విషయమున నేమఱకున్నది పరిషత్పత్త్రికయే యనుట యతిశయోక్తి కాదు. సంస్కృతాంధ్రసాహిత్యగ్రంథములపై విమ ర్శనవ్యాసములు, చారిత్రకవిషయ పరిశీలనములు, అముద్రితప్రాచీన గ్రంథముద్రణము మున్నగు విషయములలో నెనుకటి క్రమమును వదలకయే నడచుచున్నది. ఈనడుమ ప్రారంభించిన నిశ్శంక కొమ్మ నామాత్యవిరచితమైన శివలీలావిలాసమును లభించినంతవఱకు సమగ్ర ముగ ముద్రింప యత్నించితిమి. ఇంక పీఠికాభాగమున కొంచెము కొదువగా మూఁడాశ్వాసముల భాగము ముద్రితమైనది. అచిరకాల ములో ఆగ్రంథమును పాఠకుల కందీయఁగలము.

వ్యాకరణమున మహాభాష్యమునకు, తర్కమున వైశేషికదర్శ నభాష్యమునకు, అలంకారమున వ్యక్తివివేకమునకు ఆంధ్రానువాద ముల నిపత్త్రికాముఖమున వెలువఱుచుచుంటిమి. మఱికొంత కాలము నకు పూర్వమీమాంసాశాస్త్ర విషయమునుగూడ పాఠకలోకమున కందీయ సంకల్పము. శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు సమగ్రత నందుటకు కొలఁదిభాగమే మిగిలియున్నది. దైవ మనుకూలించిన అచిరముగ నేదానినిగూడ పూర్తిగావింప నిశ్చయించుకొనియున్నాము.

సంపాదకుఁడు.

# పాతంజలమహాభాష్యము — పస్పశాహ్నికము

(గతసంచిక తరువాయి)

శ్రీభాష్యం అప్పలాచార్య.

మూ. కుత ఏతత్ ?

అదెట్లు ?

మూ. యోహి శబ్దాన్ జానాత్యపశబ్దా నప్యసౌ జానాతి యథైవహి శబ్దజ్ఞానే ధర్మః, ఏవమపశబ్దజ్ఞానేఽప్యధర్మః అథవా భూయా నధర్మః ప్రాప్నోతి। భూయాంసోఽపశబ్దాః, అల్పీయాంసశ్శబ్దా ఇతి। ఏకైకస్యహి శబ్దస్య బహవోఽపభ్రంశాః। తద్యథా గౌరిత్యస్య శబ్దస్య గావీ, గోణీ, గోతా, గోపోతలికేత్యేవమాదయో బహవోఽపభ్రంశాః। అథ యోఽవాగ్యోగవిత్ అజ్ఞానం తస్య శరణమ్ ।

ఎవఁడు సాధుశబ్దముల నెఱుంగునో వాఁడు అపశబ్దములనుఁగూడ ఎఱింగియే తీరునుకదా ! సాధుశబ్దజ్ఞానముచే ధర్మము ప్రాప్తించినట్లు అపశబ్దజ్ఞానముచే అధర్మమును ప్రాప్తించును. అంతియే కాదు. ధర్మముకంటె నధర్మమే వానికి నెక్కువగును. సాధుశబ్దములు తక్కువగాను, అపశబ్దము లెక్కువగాను గోచరించుచుండునుగదా! ఒక్కొక్క సాధుశబ్దమున కెన్నియో అపశబ్దములుండును. 'గోవు' అనుశబ్దమునకు 'గావి' 'గోణి' 'గోత' 'గోపోతలిక' మొదలగునవెన్నియో అపభ్రంశములు. ఇఁక శబ్దముల మంచిచెడ్డల నెఱుంగనివానికి వాని అజ్ఞానమే శరణము. కనుక వానికి అధర్మ మంటదు.

మూ. విషమ ఉపన్యాసః। నాత్యంతా యాజ్ఞానం శరణం భవితు మర్హతి। యోహ్యజానన్ వై బ్రాహ్మణం హన్యాత్ సురాం వా పిబేత్ సోఽపి మన్యే పతితః స్యాత్ ।

ఏమిది ? ఇట్లుచెప్పుట విషమముగా నున్నదే ? మంచిచెడ్డలను ఎఱుఁగకపోవుట అధర్మము రాకుండ నెట్లు కాపాడఁగలదు ? బ్రాహ్మణుని చంపరాదను నిషేధము నెఱుఁగక బ్రాహ్మణుని జంపినను, కల్లు త్రాగరాదను నియమము తెలియక కల్లుత్రాగినను వాని కాదోషము ప్రాప్తించునే కాని విడువదుగదా !

వి. విధి నిషేధముల నెఱుంగుటకు యోగ్యతలేని తిర్యక్కులు తెలిసికొనలేకపోవుట న్యాయ్యముకాని యోగ్యతగల మానవులువాని నెఱుంగకయుండి, "తెలియక చేసితిమిగదా మాకు పాప మంటదు" అనుకొనుట న్యాయ్యముకాదు. యోగ్యతకలిగి విధినిషేధములు తెలిసికొనకపోవుట యనెడి మఱియొక పాపముకూడ సంభవించును. కాని నిషిద్ధమగు కార్యమును తెలియకచేసినను పాప మంటకమానదు.

మూ. ఏవం తర్హి సోఽనన్త మాప్నోతి జయం పరత్ర వాగ్యోగవిద్ దుష్యతి చాపశబ్దైః. కః ?। అవాగ్యోగవిదేవ। అథ యో వాగ్యోగవిద్, విజ్ఞానం తస్య శరణమ్।

సరే! అట్లైనచో వాగ్యోగము నెఱింగినవాఁడు పరమున ననంతమగు జయమును బొందును. అపశబ్దములచే దూషితుఁడును అగును ఎవడు? వాగ్యోగము నెఱుంగనివాఁడే! శబ్దస్వరూపము నెఱింగినవాఁడు అపశబ్దములను ఎఱింగినను శబ్దములనుగూడ ఎఱుఁగును. కావున శబ్దస్వరూపవిజ్ఞానమే అతనికి అభ్యుదయ జనకమగును.

వి. శబ్దములనుగాని అపశబ్దములనుగాని ప్రయోగించుటచేతనే (లోకమున) ధర్మముగాని అధర్మముగాని ప్రాప్తింపవు. శబ్దములను సాధుశబ్దములనుగాఁ దెలిసికొని ప్రయోగించినవాఁడు అభ్యుదయము జనించును. అపశబ్దములను అపశబ్దములనుగాఁ దెలిసికొనినను ప్రయోగింపనివాఁడు అధర్మము రాదు. శబ్దములను సాధుశబ్దము

లనుగా నెఱుంగుటయే ధర్మహేతువనియు, అపశబ్దములను ప్రయో
గించుటయే అధర్మహేతు వనియు నెఱుంగవలెను.

మూ. క్వపున రిదం పఠితమ్ ?

ఇది ఎక్కడ చెప్పఁబడినది ?

వి. "యస్తుప్రయుంక్తే" అనునది శ్రుతికాదు. మఱియెందు
లోనిదో తెలియదు. అందుచే దాని ప్రామాణ్యమును శంకించి
ప్రశ్నించినాఁడు.

మూ. భ్రాజా నామ శ్లోకాః।

భ్రాజ లనెడు శ్లోకములలోనిది.

"భ్రాజలు" అని కొన్నిశ్లోకములు కాత్యాయనుఁడు రచించి
నవి గలవు.

మూ. కించ భోః శ్లోకా అపి ప్రమాణమ్ ?

ఆ. ఏమి ? శ్లోకములుకూడ ప్రమాణమేనా ?

మూ. కిం చాతః ?

అయితే నేమి ?

మూ. యది శ్లోకా అపి ప్రమాణం అయమపి శ్లోకః ప్రమా
ణం భవితు మర్హతి।

యదుదుమ్బరవర్ణానాం ఘటీనాం మణ్డలం మహత్
పీతం న గమయేత్ స్వర్గం కింతత్ క్రతుగతం నయేత్ ?

శ్లోకములుకూడ ప్రమాణమే యైనచో నీశ్లోకముకూడప్రమా
ణమే కావచ్చునుకదా !

"యదుదుంబర వర్ణానాం ఘటీనాం మండలం మహత్
పీతం నగమయేత్ స్వర్గం కింతత్ క్రతుగతం నయేత్.

ఉదుంబర వర్ణముగల కుండలకొలది త్రాగినను స్వర్గమును జేర్ప
లేని సుర(కల్లు)యాగమున త్రాగినంతమాత్రముననెట్లు చేర్పఁగలదు.

వి. సౌత్రామణి యాగమున సురాపానము విహితము. దాని నాక్షేపించుటకై వేదదూషకులు చెప్పు శ్లోక మిది.

మూ. ప్రమత్తగీత ఏష తత్రభవతః యస్త్వప్రమత్తగీత స్తత్ప్రమాణమ్.

వేదము విషయమున ప్రామాణ్యములేని ప్రమత్తుని ప్రమాదాలాప మీశ్లోకము. అప్రమాదముతో (వేదప్రామాణ్యాతిక్రమము లేక) చెప్పినది శ్లోకమైనను ప్రమాణమే.

వి. పై భ్రాజయను శ్లోకము శ్రుతిననుసరించి చెప్పినదే. "ఏకః శబ్దః సమ్యక్ జ్ఞాతః శాస్త్రాన్వితః సుప్రయుక్తః స్వర్గే లోకే కామధుగ్భవతి" అనుశ్రుత్యర్థమునే ఈ శ్లోకము వివరించినది. కావున నిది ప్రమాణము.

మూ. అవిద్వాంసః ప్రత్యభివాదే నామ్నో యే న ప్లుతిం విదుః కామం తేషు తు విప్రోష్య స్త్రీష్వివా య మహం వదేత్.

అభివాదే స్త్రీవన్మాభూమే త్యధ్యేయం వ్యాకరణమ్

ప్రత్యభివాదనమున నమస్కరించిన వానిపేరును ప్లుతముగా ఉచ్చరింపవలెనని తెలియని అవిద్వాంసులకు ఆ వారికి నమస్కరించునటుల తనపేరును జేర్కొనక 'అయమహమ్' అను మాటలతో అభివాదనము చేయవలెను.

నమస్కారమునందుటలో స్త్రీవలె పరిగణింపఁబడకుండుటకు వ్యాకరణము నధ్యయనము చేయవలెను.

వి. విద్వాంసులగు పురుషులకు నమస్కరించునపుడు తనపేరు చెప్పుచు 'అభివాదయే దేవదత్తో౽హమ్' "దేవదత్తుఁడను నేను నమస్కరించుచున్నాను" అని చెప్పవలెను. అపుడాపెద్దలు "ఆయుష్మాన్ ఏధి దేవదత్తా" "ఓ దేవదత్తా! ఆయుష్మంతుఁడవై వర్ధిల్లుము" అని పేరు చివరియచ్చును ప్లుతముగా నుచ్చరించి ప్రత్యభివాదము చేయ

వలెను. అట్లు ప్లుతమును చేర్చుట యెఱుంగని యవిద్వాంసులకు నమస్కరించునపుడు స్త్రీలకువలె "అభివాదయే అయ మహం" అని అభివాదనము చేయవలెను. అందుచే స్త్రీలతో సమానముగ పరిగణింపఁబడకుండుటకు వ్యాకరణమును నేర్వవలెను.

మూ. విభక్తిం కుర్వంతి:—యాజ్ఞికాః పఠంతి· "ప్రయాజాః సవిభక్తికాః కార్యాః" ఇతి. న చాంతరేణ వ్యాకరణం ప్రయాజాః సవిభక్తికాః శక్యాః కర్తుం" విభక్తిం కుర్వంతి.

'ప్రయాజలు' అనెడి అగ్నిదేవతాకములగు మంత్రముల నాయా విధులందు ప్రథమా, ద్వితీయా, తృతీయా సప్తమీ విభక్త్యంతముగు నగ్నిశబ్దముతో నుచ్చరింపవలెనని యాజ్ఞికులు చెప్పుచున్నారు. వ్యాకరణ సాహాయ్యములేనిచో ఆయావిభక్తులతో ప్రయాజలను ప్రయోగించుట సాధ్యపడదు.

వి. "సమిధః అగ్నే ఆజ్యస్య వ్యంతు. తనూనపాత్ అగ్నే ఆజ్యస్య వ్యేతు" అనునవి ప్రయాజమంత్రములు. వీనిలో 'అగ్నే' అను సంబుద్ధికి ముందు 'అగ్ని' శబ్దమును సంబోధన, ప్రథమా, ద్వితీయా, తృతీయా, సప్తమీ విభక్తులలో నుచ్చరింపవలెను అని యాజ్ఞిక సంప్రదాయము. ఉదా : సమిధః అగ్నే ఆగ్నే ఆజ్యస్యవ్యంతు
సమిధః అగ్నేం అగ్నే ఆజ్యస్య వ్యంతు
సమిధః అగ్నినా అగ్నే ఆజ్యస్యవ్యంతు
సమిధః అగ్నౌ అగ్నే ఆజ్యస్య వ్యంతు

పై విధముగా శబ్దముల నాయావిభక్తులతోఁ జేర్చుటకు వ్యాకరణ మావశ్యకము.

మూ. యోవా ఇమాం:

"యో వా ఇమాం పదశః స్వరశోఽక్షరశశ్చ వాచం విదధాతి స ఆర్త్విజీనో భవతి" ఆర్త్విజీనాః స్యామేత్యధ్యేయం వ్యాకరణం

స్వరవివేకము, అక్షరజ్ఞానము, పదస్వరూప నిశ్చయము కలిగి శబ్దములను ప్రయోగింపఁగలవాఁడే యజమానుఁడుగను, యాజకుఁడుగను ఉండఁదగును. యాగముచేయుటకును, యాగముచేయించుటకును, దగినవారము కావలె ననిన వ్యాకరణమును నేర్వవలెను.

మూ. చత్వారి

చత్వారి శృంగా త్రయో అస్య పాదా
ద్వే శీర్షే సప్తహస్తాసో అస్య
త్రిధా బద్ధో వృషభో రోరవీతి
మహోదేవో మర్త్యా ఆవివేశ.

చత్వారి శృంగాణి-చత్వారి పదజాతాని నామాఖ్యాతోపసర్గనిపాతాశ్చ. త్రయో అస్య పాదాః త్రయః కాలాః.భూతభవిష్యద్వర్తమానాః. ద్వే శీర్షే ద్వౌ శబ్దాత్మానౌ నిత్యః కార్యశ్చ.సప్తహస్తాసో అస్య—సప్త విభక్తయః త్రిధా బద్ధః—త్రిషు స్థానేషు బద్ధః ఉరసికణ్ఠే శిరసి ఇతి వృషభోవర్షణాత్. రోరవీతి శబ్దం కరోతి కుత ఏతత్ ? రౌతిః శబ్దకర్మా. మహో దేవో మర్త్యా ఆవివేశేతి।మహాన్ దేవః శబ్దః।మర్త్యా మరణధర్మాణో మనుష్యా స్తా నావివేశ।మహతా దేవేన నః సామ్యం యథా స్యా దిత్యధ్యేయం వ్యాకరణం॥

నాలుగు కొమ్ములు, మూఁడు పాదములు, రెండు తలలు, ఏడు చేతులు కలిగి మూఁడుచోట్లఁ గట్టఁబడి యఱచుచుండు వృషభస్వరూపుఁడగు మహాదేవుఁడు మర్త్యులను ఆవేశించి యుండెను.

నాలుగు కొమ్ములు:—అనఁగా నామము, అఖ్యాతము, ఉపసర్గము, నిపాతము అను నాల్గువిధములగు పదములు.

మూఁడు పాదములు:—భూత, భవిష్యత్, వర్తమానకాలములు

రెండు తలలు:—నిత్యము, కార్యము అను రెండువిధములగు శబ్దములు.

ఏడుచేతులు—ఏడు విభక్తులు

మూఁడుచోట్ల కట్టఁబడుట—హృదయమున, కంఠమున శిరమున నుచ్చరింపఁబడుట.

అఱచుట యనఁగా ధ్వని నిచ్చుట.

వృషభము కోరికలను వర్షించునది.

వర్షించునది కావున వృషభము కోరికలను నెఱవేర్చునది.

పైన వర్ణించినవిధమున నవయవసన్నివేశముగలమహాదేవుఁడు శబ్దమే. ఆశబ్దము అంతర్యామియై మరణస్వభావముగల మనుష్యుల నావేశించి యుండును.

శబ్దరూపమగు పరబ్రహ్మముతో సాయుజ్యము నందవలెనన్న వ్యాకరణము నధ్యయనము చేయవలెను.

మూ. అపర ఆహ.

చత్వారి వాక్పరిమితా పదాని
తాని విదు ర్బ్రాహ్మణా యే మనీషిణః
గుహా త్రీణి నిహితా నేంగయంతి
తురీయం వాచో మనుష్యా వదంతి.

'చత్వారి వాక్పరిమితాపదాని'—చత్వారి పదజాతాని. నామాఖ్యాతోపసర్గనిపాతాశ్చ। తాని విదు ర్బ్రాహ్మణా యే మనీషిణః మనస ఈషిణః మనీషిణః॥ 'గుహా త్రీణి నిహితా నేంగయంతి. గుహాయాం త్రీణి నిహితాని నేంగయంతి న చేష్టంతే। న నిమిషం తీత్యర్థః 'తురీయం వాచో మనుష్యా వదంతి. తురీయం వా ఏత ద్వాచో య న్మనుష్యేషు వర్తతే చతుర్థ మిత్యర్థః॥ చత్వారి. శబ్దముయొక్క నాల్గురూపములను శబ్దతత్త్వవిదులగు మనీషులే యెఱుంగఁగలరు. ఆనాల్గురూపములలో మూఁడు రూపములు గుహాలోనుండును. నాల్గవరూపమున నుండువాక్కునే మనుష్యులు పలుకుచున్నారు. నాల్గవవిధమగు వాకు

నే కాక మిగిలిన మూఁడు విధములనుగూడ నెఱుంగవలె నన్న వ్యాకరణదీక్ష మావశ్యకము.

వి. శబ్దము నాల్గురూపముల నుండును.

1. పరా 2. పశ్యంతీ 3. మధ్యమా 4. వైఖరీ

ప్రాణాదివాయువు, శబ్దతన్మాత్రపరమాణువులు, ఇచ్ఛారూప జ్ఞానమును కలిసి శబ్దరూపమున పరిణామ మందును.

జ్ఞానప్రధానమై శబ్దబ్రహ్మ మని వ్యవహరింపఁబడు చేతన మిశ్రమగు నాదము మూలాధారబిందువునుండి ఇచ్ఛాజన్యసంస్కృత పవనచలనముచే అభివ్యక్తముగ నుండు శబ్దబ్రహ్మమే పరావాక్కు. ఇది యోగులకు సమాధియందు నిర్వికల్పకజ్ఞానగోచర మగును.

ఆపరాశబ్దము నాభిపర్యంతమువచ్చి నిచ్ఛాసంస్కృత ప్రాణ-వాయువుచే నాభిదేశమున నభివ్యక్తమై మనోవిషయమై పశ్యంతి యనఁబడును. ఇది యోగులకు సమాధిలో సవికల్పక జ్ఞానగోచర మగును.

ఆపశ్యంతి హృదయపర్యంతము వచ్చినిచ్ఛాసంస్కృత ప్రాణ వాయువుచే హృదయదేశమున నభివ్యక్తమై బుద్ధివిషయమై మధ్యమ యనఁబడును. ఈమధ్యమవాక్కు చెవిమూసికొని విన్నచో ఎవరిలో వారికి వినఁబడును. ఆమధ్యమ ఆస్యపర్యంతము పోవువాయువుచే కంఠ దేశము చేరి అచటినుండి మూర్ధపర్యంతము పోయి మరలి క్రిందకు వచ్చి ఆయాకంఠతాల్వాదిస్థానములలో అభివ్యక్తమగును. ఈశబ్దము వైఖరి యనఁబడును. కేవలప్రాణవాయువేకాక వ్యానోదానముల తోఁగూడిన ప్రాణవాయువు ఈవైఖరిని అభివ్యక్తముచేయును. ఇది ఇతరుల చెవులకు వినఁబడును.

ఈవైఖరీరూపమగు శబ్దమే యందఱకును సామాన్యముగ తెలియుశబ్దము. వెనుకటి మూఁడవస్థలో నీశబ్దము హృదయ మనుగు

హాలో అజ్ఞాతమై యుండును. వ్యాకరణశాస్త్రబలమున లభించిన యోగదీపముచే చీకటిని దొలఁగించిన వానికిఁ గనుఁగొన వీలగును. శబ్దబ్రహ్మముయొక్క వ్యక్తావ్యక్తరూపముల నన్నిటినిఁ జూడవలె నన్న వ్యాకరణము నధ్యయనము చేయవలెను.

**మూ.** ఉతత్వః

ఉత త్వః పశ్య న్నదదర్శ వాచ
ముత త్వః శృణ్వ న్న శృణో త్యేనామ్
ఉతో త్వస్మై తన్వం విసస్రే
జాయేవ పత్య ఉశతీ సువాసాః॥

'ఉత త్వః' అపిఖ ల్వేకః పశ్యన్నపి నపశ్యతి వాచం
అపిఖ ల్వేకః శృణ్వన్నపి నశృణో త్యేనా మితి।అవిద్వాంస మాహార్థం।ఉతో త్వస్మై తన్వం విసస్రే, తనుం వివృణుతే।
జాయేవ పత్య ఉశతీ సువాసాః।తద్యథా జాయా పత్యే కామయమానా।సువాసాః స్వ మాత్మానం వివృణుయా దాత్మాన మిత్యేధ్యేయం వ్యాకరణం. ఉశత్వః

శబ్ద మొకానొకనికిఁ గాన్పించినను గాన్పింపనితీరుగనుండును. వినిపించినను వినిపింపనితీరుగ నుండును. ఇంతవఱకు అవిద్వాంసుని గూర్చి చెప్పినాఁడు.

ఇఁక ఆశబ్దమే యొకనికి దాను వరించిన తనపతికి సతి ఋతు కాలమున తనంత తానై కోరి తనయాకారమును అచ్ఛముగా నర మరికలేక ప్రదర్శించినట్లు తనరూపమును ప్రదర్శించును.

వి. బాగుగ నేర్చినవాఁడైనను తీక్ష్ణబుద్ధియైనను అర్థము నెఱుఁ గనివానికి శబ్దమును జూచినను జూడనట్లును, వినినను విననట్లును అర్థము నెఱుంగుటయే కదా శబ్దమును నేర్చుటకుఁగాని వినుటకుఁ

గాని ప్రయోజనము. వైయాకరణుఁడు శబ్దస్వరూపమును దానియర్థమునుగూడ నెఱుంగఁజాలును. కావున ఆతనికి వాక్కాంత తన శరీరమును సంపూర్ణముగా అనావృతముగాఁ జూపును. వాక్కు యొక్క శరీరము అర్థమేకదా !

మూ. సక్తుమివ

సక్తుమివ తితఉనా పునంతో
యత్ర ధీరా మనసా వాచ మక్రత ।
అత్రాసఖాయః సఖ్యాని జానతే
భద్రైషాం లక్ష్మీ ర్నిహితాధివాచి॥

సక్తుః- సచతే ర్దుర్ధావో భవతి, కసతే ర్వా విపరీతా ద్వికసితో భవతి. తితఉ— పరివనం భవతి—తతవద్వా తున్నవద్వా ధీరాఃధ్యానవంతః మనసా ప్రజ్ఞానేన వాచ మక్రత వాచ మకృషత అత్రా సఖాయః సఖ్యాని జానతే అత్ర సఖాయః సంతః సఖ్యాని జానతే.
క్వ? య ఏష దుర్గో మార్గః; ఏకగమ్యో వాగ్విషయః కే పునస్తే? వైయాకరణాః। కుత ఏతత్? భద్రైషాం లక్ష్మీ ర్నిహితాధి వాచి।ఏషాం వాచి భద్రా లక్ష్మీ ర్నిహితా భవతి. లక్ష్మీ ర్లక్షణా ద్భాసనా త్పరివృఢా భవతి। సక్తుమివ

అ. వైయాకరణులు శబ్దబ్రహ్మధ్యానపరాయణులై పేలపిండిని జల్లెడతో గాని చేటతోఁ గాని జల్లించి శుభ్రపఱచినట్లు తమ జ్ఞానముచే అసాధుశబ్దములనుండి సాధుశబ్దములను వేఱుచేయుదురు. బ్రహ్మ ప్రతిపాదకమగు శబ్దమునకును అర్థమునకును భేదములేదని తెలిసికొని బ్రహ్మైక్యజ్ఞానము కలవారై ఆ విధముగనే సమస్త పదార్థములందు అభేదజ్ఞానము కలవారై సాయుజ్యమునందుదురు. వారి వాక్కునందు స్వప్రకాశరూపమగు లక్ష్మి అధికముగ నిలిచి యుండును. స కుశబము 'సచ' ధాతువు నుండి నిష్పన్నమైన రూపము

కావున 'దుర్ధావము' 'దుశ్శోధము' చాలకష్టపడిన గాని బాగు చేయుటకు వీలు కానిది అని యర్థము వచ్చును.

లేదా 'కస' ధాతువు నుండి యేర్పడిన రూపము కావచ్చును. కసధాతువు వ్యత్యస్తమై 'సక్తు' అనురూప మేర్పడి యుండును.

'తితఉ' అనఁగా బాగుచేయుట కుపయోగించు సాధనము 'చేట' గాని 'జల్లెడ' గాని కావచ్చును.

'ధీరులు' అనఁగా వ్యాకరణ ధ్యానము కలవారు.

మనస్సు అనఁగా జ్ఞానము.

"అత్రా సఖాయః సఖ్యాని జానతే

ఈవిషయమున అభేదజ్ఞానము కలవారై ఐక్యము నందుదురు.

ఈవిషయమున ననఁగా ఏవిషయమున ?

ఏది దుర్గమ మగుమార్గమో, ఏది జ్ఞానము చేతనే పొందఁ దగినదో, ఏది వేదరూపవాక్కునకు విషయమో అట్టి దాని విషయమున. ఆయభేదజ్ఞానము నందువా రెవరు?

వైయాకరణులు.

ఎందు చేత ?

భద్రైషాం లక్ష్మీర్నిహి తాధివాచి

ఈ వైయాకరణు లధ్యయనము చేసిన వేదరూపమగు వాక్కునందు సర్వప్రకాశకమును, స్వయంప్రకాశకమును నగు బ్రహ్మము స్థిరముగా నిలిచియుండును.

'లక్ష్మీ' యనఁగా భాసించునది; అనఁగా ప్రకాశక మగు బ్రహ్మము.

వి. వైయాకరణులు శాస్త్రసాహాయ్యమున ప్రకృతి ప్రత్యయ విభాగ పూర్వకముగ సాధుశబ్దముల నెఱింగి శాస్త్రార్థ ధ్యానము

కలవారై మానసజ్ఞానముచే అసాధుశబ్దముల నుండి సాధువులను వేఱు చేయుదురు. అట్లు వేఱుచేసి యట్టి సాధుశబ్దములనే ప్రయోగించుటచే అంతఃకరణశుద్ధి కలవా రగుదురు. అట్లు నిర్మలస్వాంతులై పరబ్రహ్మ వాచకమగు తచ్ఛబ్దమునకును, జీవవాచకమగు 'త్వం' శబ్దమునకును భేదము లేదనియు, శబ్దములకును తత్ప్రతిపాద్యములగు నర్థములకును భేదము లేదనియు నెఱింగి యభేదజ్ఞానము కలవారగుదురు. అట్లు శబ్దమంతయు బ్రహ్మ స్వరూపమే యని యెఱింగిన పిమ్మట నా దృష్టాంతము చేతనే సమస్త పదార్థములందును బ్రహ్మ బుద్ధికలవా రగుదురు. ఇట్లు వ్యాకరణము బ్రహ్మైక్యానుసంధానమునకు ఉపకరించుచు మోక్షజనక మగును.

మూ॥ సారస్వతీం

యాజ్ఞికాః పఠంతి "ఆహితాగ్ని రపశబ్దం ప్రయుజ్య ప్రాయశ్చిత్తీయాం సారస్వతీ మిష్టిం నిర్వపేత్" ఇతి ప్రాయశ్చిత్తీయా మా భూమే త్యధ్యేయం వ్యాకరణం।

అ. ఆహితాగ్ని యపశబ్దమును ప్రయోగించిన ప్రాయశ్చిత్తముగ సారస్వతేష్టి నాచరింపవలెను, అని యాజ్ఞికులు దెల్పుచున్నారు. ప్రాయశ్చిత్తము చేసికొనవలసిన స్థితి రాకుండుటకై ఆహితాగ్ని వ్యాకరణమును చదువుకొనవలెను.

మూ. దశమ్యాం పుత్రస్య

యాజ్ఞికాః పఠంతి "దశమ్యుత్తరకాలం పుత్రస్య జాతస్య నామ విదధ్యాత్ ఘోషవదా; ద్యంత రంతస్థ మవృద్ధం త్రిపురుషానూక మనరిప్రతిష్ఠితం తద్ధి ప్రతిష్ఠితతమం భవతి. ద్వ్యక్షరం చతురక్షరం వానామ కృతం కుర్యా న్నతద్ధితం" ఇతి. న చాంతరేణ వ్యాకరణం కృత స్తద్ధితా వా శక్యా విజ్ఞాతుం. దశమ్యాం పుత్రస్య

౮. పదిరోజులు పురుడు తీటిన పిదప తండ్రి కుమారునకు నామకరణము చేయవలెను. ఆపేరు ఈక్రింది నియమముల ననుసరించి యుండవలెను. పేరునకు మొదట ఘోషాక్షరము లుండవలెను. నడుమ అంతస్థ (యరలవ) వర్ణము లుండవలెను మొదటి అచ్చు వృద్ధి (ఆ. ఐ. ఔ) అక్షరములలో నొకటి కారాదు. ఆపేరు వెనుకటి మూఁడు తరముల వారిలో నెవరికైనను సంబంధించి యుండవలెను. కేవల నరవాచకము కారాదు. శత్రువు పేరు కారాదు. భగవత్ప్రతిష్ఠితము కావలెను. రెండు లేదా నాలుగు అక్షరములను గల్గియుండవలెను. కృదంతముగా నుండవలెను. కాని తద్ధితాంతము కారాదు. అని యాజ్ఞికులు చెప్పుచున్నారు.

వ్యాకరణము లేనిదే కృత్తులు, తద్ధితములు తెలిసికొనుటకు శక్యము కాదు గదా. అందుచే వ్యాకరణమును నేర్వవలెను.

మూ॥ సుదేవో అసి

సుదేవో అసి వరుణ యస్య తే సప్త సింధవః।

అను క్షరంతి కాకుదం సూర్మ్యం సుషిరా మివ॥ సుదేవో అసి వరుణ సత్యదేవోసి యస్య తే సప్త సింధవః సప్త విభక్తయః। అను క్షరంతి కాకుదం కాకుదం తాలు। కాకు ర్జిహ్వా, సాస్మి న్నుద్యతే ఇతి కాకుదం। సూర్మ్యం సుషిరా మివ। తద్యథా శోభనా మూర్మిం సుషిరా మగ్ని రంతః ప్రవిశ్య దహతి, ఏవం తే సప్తసింధవః సప్త విభక్తయః తా ల్వనుక్షరంతి। తేనాసి సత్యదేవః। సత్యదేవాః స్యామే త్యధ్యేయం వ్యాకరణం।

అ. ఓవరుణ ! నీ తాలువునందు ఏడు విభక్తులు (సింధువులు) ప్రకాశించినవై సచ్ఛిద్రమగు (గుల్లగానున్న) అయః ప్రతిమను అగ్నివలె పరిశుద్ధ మొనర్చినవి। అందుచే నీవు సత్యదేవుఁడ వైతివి.

సుదేవుఁడు అనఁగా సత్యదేవుఁడు అని యర్థము.

సత్యముచే భాసించువాఁడు. ఏడు సింధువులు అనఁగా ఏడు విభక్తులు. కాకుదము అన తాలువు. కాకువు అనఁగా జిహ్వా అది మీఁదికి నెత్తఁబడును గాన కాకుదము శబ్దము పలుకఁబడు స్థానము అను నర్థమున 'వద్' అను ధాతువునుండి "సా అస్మిన్ ఉద్యతే ఇతి" కాకుదం అనురూప మేర్పడును.

మనము గూడ వరుణునివలె సత్యదేవులము కావలె ననిన వ్యాకరణము ఆవశ్యకము.

వి. వరుణునకు సత్యదేవుఁడు' అను వ్యవహారము వాని వాక్శుద్ధిచే గలిగినది. సత్యముచే భాసించు వాఁడు సత్యదేవుఁడు.

అసత్యము రెండు విధములు 1 అర్థ సంబంధి 2 శబ్ద సంబంధి. లోకములో నర్థమునకు సంబంధించిన యసత్యము నాడరాదని మన మెఱుఁగుదుము. అట్లే సాధు శబ్దమునకు బదులు అపశబ్దము నుచ్చరించుట శబ్దా సత్యము. ఈశబ్దానృతము కూడ పాపహేతువే. అది కూడ లేనివాఁడగుటచే వరుణుఁడు సుదేవుఁ డాయెను.

తాలు భాగము నుండి అభివ్యక్తములగు శబ్దములు శరీరము నందలి సమస్త పాపములను, గుల్లగానున్న ఇనుప విగ్రహమునకు లోపల నున్న చిలుమును అగ్ని పోఁగొట్టునట్లు, పోఁగొట్టి శరీరమును ప్రకాశింపఁజేయును.

మూ. కిం పున రిదం వ్యాకరణమే వాధిజిగాంసమానేభ్యః ప్రయోజన మన్వాఖ్యాయతే,నపున రన్యదపి కించిత్ 'ఓమ్' ఇత్యుక్త్వా వృత్తాంతశః శమి త్యేవమాదీన్ శబ్దాన్ పఠంతి.

అ. వ్యాకరణాధ్యయనము చేయఁగోరు వారికి మాత్రమే యీ ప్రయోజనము నెందులకుఁ జెప్పవలెను. వేదాధ్యయనము చేయువారికి ముందు చెప్పుచున్నారా? లేదు గదా! వేదమును

ప్రయోజనము తెలియకయే చదువవలె నని యంగీకరించి ప్రపాఠకముల నన్నింటిని చదువుచున్నారు కాదా ?

మూ పురాకల్ప ఏత దాసీత్. సంస్కారోత్తరకాలం బ్రాహ్మణా వ్యాకరణం స్మాధీయతే। తేభ్య స్తత్తత్స్థానకరణ నాదాను ప్రదానజ్ఞేభ్యో వైదికాః శబ్దా ఉపదిశ్యంతే। తదద్యత్వే న తథా వేద మధీత్య త్వరితా వక్తారో భవంతి।

వేదా న్నో వైదికా శ్శబ్దాః
సిద్ధా లోకాచ్చ లౌకికాః।

అనర్థకం వ్యాకరణ మితి। తేభ్య ఏవం విప్రవిపన్న బుద్ధిభ్యోఽధ్యేతృభ్యః సుహృద్ భూత్వా ఆచార్య ఇదంశాస్త్ర మన్వాచష్టే ఇమాని ప్రయోజనా న్యధ్యేయం వ్యాకరణమ్ ఇతి॥

అ. పూర్వకాలమున ఉపనయనము కాగానే బ్రాహ్మణులు వ్యాకరణమును నేర్చుకొనుచుండిరి. వ్యాకరణముచే ఆయావర్ణముల యుచ్చారణ స్థానములను, అభ్యంతర ప్రయత్నములను, బాహ్య ప్రయత్నములను ఎఱిగిన వారికే వైదికశబ్దము లుపదేశించుచుండిరి.

కాని యీనాఁ డట్లు కాదు.

వేదమును నేర్చి త్వరగా వక్త లగుచున్నారు. వారికి "వేదము వలన వైదిక శబ్దములు తెలిసినవి.లోక వ్యవహారము వలన లౌకికశబ్దములు తెలియుచున్నవి. ఇఁక వ్యాకరణము నిష్ప్రయోజనము" అను విపరీతబుద్ధి జనించును. అట్టి వారికి మిత్రునివలె నాచార్యుఁడు లాలించి యీశాస్త్రము నుపదేశించుచు ఇవి వ్యాకరణాధ్యయనమునకు ప్రయోజనములు వీనికై వ్యాకరణము చదువవలెను అని చెప్పుచున్నాఁడు.

3. శాస్త్ర నిర్మాణ రీతి నిరూపణాధికరణము.

మూ. శబ్దానుశాసన మిదానీం కర్తవ్యమ్। తత్కథం కర్తవ్యమ్? కిం శబ్దోపదేశం కర్తవ్యః, ఆహోస్విదపశబ్దోపదేశః, ఆహోస్విదుభయోపదేశ ఇతి ? ॥

అ. ఇఁక శబ్దానుశాసనమునుఁ జేయవలెను.

ఎట్లు చేయవలెను ? సాధుశబ్దముల నుపదేశింపవలెనా ? అసాదు శబ్దముల నుపదేశింపవలెనా ? లేక రెంటిని గూడ నుపదేశింపవలెనా ?

మూ॥ అన్యతరోపదేశన కృతం స్యాత్ తద్యథా భక్ష్యనియమే నాభక్ష్య ప్రతిషేధో గమ్యతే "పంచ పంచనఖా భక్ష్యాః" ఇత్యుక్తే గమ్యత ఏతత్ అతోఽన్యే అభక్ష్యా ఇతి। అభక్ష్య ప్రతిషేధేన వా భక్ష్యనియమః। తద్యథా "అభక్ష్యో గ్రామ్యకుక్కుటః, అభక్ష్యో గ్రామ్య సూకరః" ఇత్యుక్తే గమ్యత ఏతత్ ఆరణ్యో భక్ష్య ఇతి। ఏవమిహాపి యది తావ చ్ఛబ్దోపదేశః క్రియతే। గౌ రిత్యేతస్మి న్నుపదిష్టే గమ్యత ఏతత్ గావ్యాదయో పశబ్దా ఇతి। అథా ప్యపశబ్దోపదేశః క్రియతే, గావ్యాదిషూపదిష్టేషు గమ్యత ఏతత్ గౌ రిత్యేష శబ్ద ఇతి.

అ. శబ్దాపశబ్దములలో నేయొక్కదాని నుపదేశించినను చాలును. తినఁదగిన పదార్థము లివి యను నియమమును పేర్కొనుటచే మిగిలినవి తినరానివి యను నిషేధము గమ్యమాన మగును.

'పంచ పంచనఖా భక్ష్యాః' 'ఐదుగోళ్ళు గల యైదు జంతువులును తినఁదగినవి' యను నియమమును చెప్పుటచే మిగిలినవి తినరానివి యని చెప్పకయే తెలియును.

అట్లే యివి తినఁదగనివి యను నిషేధమును జెప్పిన 'తినదగిన వివి' యను నియమము మనకు స్ఫురించును.

# వైశేషిక దర్శనము

## ప్రశస్తపాదభాష్యము

అనువాదము-కొల్లూరు సోమశేఖరశాస్త్రి.

సమస్త కార్యమాత్రములకు కారణమగు నీశ్వరునికిని, పిదప కణాదమునికిని నమస్కరించి, ఆ యీశ్వరకణాదమునుల ప్రసాదము వలన, నుత్కృష్ట జ్ఞానసాధనమగు, పదార్థ ధర్మసంగ్రహము రచింపఁ బడుచున్నది. ఇదియె వైశేషికసూత్రములకు ప్రశస్తపాదులు రచించిన భాష్యము.

ద్రవ్యము, గుణము, కర్మ, సామాన్యము, విశేషము, సమవాయము, అను నాఱుపదార్థములయొక్క తత్త్వజ్ఞానము మోక్షసాధనము. ఈతత్త్వజ్ఞానము, సాధర్మ్యవైధర్మ్యములనుబట్టి పదార్థములను బరిశీలించినపుడు గలుగును. సాధర్మ్యమన చాలవస్తువులందు ననుగతముగా నుండుధర్మము. కొన్నివస్తువులందుండి కొన్నిటియం దుండని ధర్మము, వైధర్మ్యమనఁబడును. సాధర్మ్య వైధర్మ్యములచే పదార్థములను బరిశీలించినవానికి పదార్థములయొక్క తత్త్వము స్పష్టముగఁ దెలియును. అందును ఆత్మేతరమగు పదార్థతత్త్వజ్ఞానము,ఆత్మతత్త్వజ్ఞానమునకు సాధనము. ఆత్మతత్త్వజ్ఞానము, మోక్షమునకు సాధనము.

మఱియు నీశ్వరప్రోక్తమగు వేదమునందు బోధింపఁబడిన,ఆత్మశ్రవణమనననిదిధ్యాసనరూపమగు ధర్మమువలనను నిశ్శ్రేయసము సిద్ధించును.

ద్రవ్యాదిపదార్థము లెన్నివిధములు ? వాని సాధర్మ్య వైధర్మ్యము లెట్టివి ? అని యిఁక పరిశీలింప వలయును.

ద్రవ్యత్వరూపమగు సామాన్యధర్మమునకు, వ్యాపకములగు పృథివీత్వాది విశేషధర్మములచే విభజింపఁబడినవి, పృథివి, జలము,

తేజస్సు, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ మనస్సు, అను తొమ్మిది ద్రవ్యములు. మహర్షి వీనికన్న నెక్కుడు ద్రవ్యముల నిరూపించి యుండుటలేదు. చాలవస్తువులందుండెడి ధర్మము, వ్యాపకము, కొద్దివస్తువులందుండెడి ధర్మము వ్యాప్యమును, అగుచుండును.

రూపము, రసము, గంధము, స్పర్శ, సంఖ్య, పరిమాణము, పృథక్త్వము, సంయోగము, విభాగము, పరత్వము, అపరత్వము, బుద్ధి, సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ప్రయత్నము, ద్వేషము, అనుపదునేడుగుణములు స్పష్టముగను, గురుత్వము, ద్రవత్వము, స్నేహము, సంస్కారము, శబ్దము, ధర్మము, అధర్మము. అను నేడుగుణములను సూత్రమునందలి 'చ' అనుపదముచేతను మొత్తము ఇరువదినాలుగు గుణములు, మునిచే నిరూపింపఁబడినవి.

ఉత్క్షేపణము, అపక్షేపణము, ఆకుంచనము, ప్రసారణము, గమనము, అని కర్మలు అయిదు విధములు. భ్రమణము (తిరుగుట) రేచనము (కారుట) స్యందనము (స్రవించుట) ఊర్ధ్వజ్వలనముఁ (పైకి మండుట) తిర్యగ్గమనము (అడ్డుగావెళ్లుట) వంగుట, లేచుట, మున్నగునవన్నియు, గమనమునందే చేరుచున్నవి; కాన వేఱుకావు.

సామాన్యమనఁగా సాధారణమగు ధర్మము. ఇది పరమనియు, అపరమనియు రెండువిధములు. ఈసామాన్యము ఏకాకారమగు జ్ఞానమునకు కారణము. అందు మహావిషయముగల పరసామాన్యముసత్తయనఁబడును. ఈసత్త అనుగతమగు జ్ఞానమునకే కారణమగుటవలన, ఇది సాధారణమేకాని, అసాధారణము కానేరదు. అల్పవిషయములగు ద్రవ్యత్వము మున్నగునవి, అనుగతబుద్ధికిని, అసాధారణబుద్ధికిని కారణములగుటవలన నివి సాధారణములు, విశేషములుగూడ నగుచున్నవి. చూడుఁడు. ద్రవ్యమ్-సత్, గుణః సన్, కర్మ సత్. అంమద్రవ్యాదులందు, అనుగతమగు బుద్ధికే కారణమగుటవలన సత్త, సాధార

ణమే యగుచున్నది. ద్రవ్యత్వము, పృథివి మున్నగు తొమ్మిదిద్రవ్యములందును, పృథివీ-ద్రవ్యమ్, జలమ్-ద్రవ్యమ్, తేజః ద్రవ్యమ్ అనెడి అనుగతమగు బుద్ధికి కారణమగుటవలన, సాధారణమును, గుణాదులందుండనందున, అసాధారణమును, అగుచున్నది.

ప్రళయమందును నశింపని నిత్యద్రవ్యములగు పరమాణ్వాదులందుండునవి విశేషములు. ఇవి అనుగతమగు బుద్ధికి హేతువులెన్నండును కాఁజాలవు. కేవలము వ్యావృత్తబుద్ధికి కారణములు వ్యావృత్తబుద్ధియ, పరమాణ్వాదులందు, ఒండొరులకుండెడి భేదబుద్ధి. కావున నివి యెప్పుడును విశేషములేకాని, సామాన్యములు కాఁరవు.

నశించునంతవఱకు ఒకదానినొకటి విడువక ఆశ్రయాశ్రయిభావమున నుండునవి, అయుతసిద్ధములు. గుణము,గుణి, క్రియ,క్రియావత్తు,మున్నగునవి. ఇట్టి అయుతసిద్ధముల కుండెడి సంబంధము, సమవాయము. ఇట్లు ద్రవ్యత్వాది రూపములగు ధర్మములను విడిచిపెట్టి, కేవలము ధర్మిరూపములగు ద్రవ్యాదులుమాత్రము నిరూపింపఁబడినవి.

ఇఁక సాధర్మ్యము నిరూపింపబడుచున్నది. ద్రవ్యము మున్నగు నాఱుపదార్థములకును, అస్తిత్వము, అభిధేయత్వము, జ్ఞేయత్వమును, సమానధర్మములు. అస్తిత్వమన ఉండుట. అభిధేయత్వమన శబ్దముచే బోధింపఁబడుట. పదమునకు,అర్థమునకును,ఉండెడి సంబంధము,అభిధ. ఇది ఈశ్వరేచ్ఛారూపము.ఇట్టి అభిధలో భాసించుట నభిధేయత్వమందురు. జ్ఞేయత్వమన జ్ఞానమందు భాసించుట. ఇవి సర్వవస్తువులకును సాధారణ ధర్మములు.

పృథివీ, జల, తేజో, వాయువులయొక్క పరమాణువులు, ఆకాశ, కాల, దిగాత్మ మనస్సులు నిత్యద్రవ్యములనఁబడుచున్నవి. ఇవి స్వతంత్రములు కాన దేనిని ఆశ్రయింపవు. వీనికన్న వేఱగుజన్య

ద్రవ్యములకు, గుణాదులకును, ఒకదాని నాశ్రయించుట సాధారణ ధర్మము.

ద్రవ్యగుణకర్మ సామాన్యవిశేషములను అయిదింటికిని సమవాయిత్వము సాధారణధర్మము. సమవాయిత్వమన, సమవాయమను సంబంధముచే, తానొకదానియం దుండుటకాని, తనయం దింకొకటి యుండుటకాని, అనియర్థము. పైవానికే అనేకత్వమును సాధారణ ధర్మము. గుణము మున్నగు అయిదింటికిని, గుణరాహిత్యము,క్రియా రాహిత్యమును, సాధారణధర్మములు. ద్రవ్యగుణకర్మల మూఁటికిని, సత్తాజాతి సంబంధము. సత్తాజాతికి వ్యాప్యములగు ద్రవ్యత్వాది జాతుల సంబంధము, వైశేషికసమ్మతమగు అర్థపదవాచ్యత్వమును, సాధారణధర్మములు. వైశేషికమతమున అర్థపదముచే, ద్రవ్య, గుణ, కర్మలు మూఁడే చెప్పఁబడును. కాని సామాన్య, విశేష, సమవాయ ములు చెప్పఁబడవు. పై మూఁటిలో సకారణములు(అనిత్యములు)అగు వానికి, పుట్టుట, నశించుటయు, సాధారణ ధర్మములు. అణుపరిమాణముకన్న భిన్నమగు పదార్థములకన్నిటికిని, కారణత్వము. సాధారణధర్మము. అణుపరిమాణముమాత్ర మెన్నఁడును దేనికిని కారణము కానేరదు. ఇట్లే ఆకాశదిక్కాలములయొక్క పరమ మహత్పరిమాణమును, దేనికిని కారణము కానేరదు. నిత్యద్రవ్యములకన్న వేఱగు, జన్యద్రవ్యములు, గుణములు, మున్నగువానికి ఏదో ఒకద్రవ్యము నాశ్రయించి యుండుట సాధారణధర్మము. సామాన్యము, విశేషము, సమవాయము, అనుమూఁటికిని సత్తాజాతిరాహిత్యము, ద్రవ్యత్వాది విశేషజాతిరాహిత్యము, అవినాశిత్వము, వైశేషికసమ్మతమగు అర్థశబ్దముచే బోధింపఁబడకుండుట,బుద్ధిమాత్రహేతుత్వమును సాధారణ ధర్మములు. సామాన్య,విశేష,సమవాయములు మూఁడును జ్ఞానమునకే కారణములు కాని మఱిదేనికిని గారణములు కావు.

పృథివి మున్నగు తొమ్మిది ద్రవ్యములకును, ద్రవ్యత్వజాతి సంబంధము, గుణవత్త్వము, విశేషమను పదార్థవత్త్వము, తనయందుదృ్భవించెడి పదార్థములకు కారణత్వము, స్వకార్యముతోఁగాని, స్వకారణముతోఁగాని విరోధము లేకుండుటయు సాధర్మ్యము. గుణమునకుఁగాని, కర్మకుఁగాని, కార్యకారణములతో నవిరోధము సంభవింపదు. ఉత్తరశబ్దమువలన పూర్వశబ్దమును, పూర్వశబ్దమువలన అంత్యశబ్దమును నశించుచున్నవి. ఇట్లే స్వకార్యమగు ఉత్తరదేశ సంయోగముచే కారణమగు క్రియ నశించుచున్నది.

పరమాణువులు మున్నగు నిత్యద్రవ్యములకు, ఒకదాని నాశ్రయింపక స్వతంత్రముగ నుండుట నశింపకుండుటయు సాధారణ ధర్మములు.

పృథివీ, జల, తేజో, వాయ్వాత్మ, మనస్సులకు, అనేకత్వమును, పృథివీత్వము, జలత్వము మున్నగు వ్యాప్యజాతిమత్త్వమును సాధారణధర్మములు.

పృథివీజల తేజోవాయు మనస్సులకు, క్రియ, వేగము, పరత్వము, అపరత్వము, పరిమితపరిమాణమును, సాధారణ ధర్మములు.

ఆకాశ, కాల, ది, గాత్మ లకు, సర్వగతత్వము, పరమ మహత్పరిమాణము, సకలమూర్త సంయోగాధారత్వమును, సాధారణ ధర్మములు. మూర్తములన పరిమితమగు పరిమాణము కలవి.

పృథివీజల తేజోవాయ్వాకాశములకు, భూతత్వము, ఇంద్రియహేతుత్వము, బాహ్యేంద్రియములగు చక్షురాదులచే గ్రాహ్యములగు రూపాదివిశేషగుణ సంబంధమును, సాధారణధర్మములు.

పృథివీ జల తేజజోవాయువులకు, ద్రవ్యకారణత్వము, స్పర్శనత్వమును, సాధారణ ధర్మములు.

పృథివీ జల తేస్సులకు, బాహ్యేంద్రియ గోచరత్వము, రూపము ద్రవత్వమును సాధారణధర్మములు.

పృథివీజలములకు, గురుత్వము, రసమునుసాధారణధర్మములు.

పృథివీజల తేజోవాయ్వాకాశాత్మలకు విశేషగుణవత్వము. సాధర్మ్యము.

పృథివీజలాత్మలకు చతుర్దశగుణవత్వము. సాధర్మ్యము.

ఆకాశాత్మలకు, క్షణికము. అల్పదేశవృత్తియు నగు విశేష గుణము, సాధర్మ్యము. ఆకాశమందు శబ్దము అట్టిగుణము. ఆత్మ యందు జ్ఞానము అట్టిగుణము.

దిక్కాలములయందు అయిదుగుణములు మాత్రముండును. ఈదిక్కాలములు సర్వకార్యనిమిత్త కారణములు. కాన పంచగుణ వత్వము, సర్వకార్యనిమిత్త కారణత్వమును,వీనికిసాధారణ ధర్మములు.

పృథివీ తేజస్సులకు నైమిత్తికద్రవత్వము, సాధర్మ్యము. పృథివి లోఁజేరిన ఘృతమునం దగ్నిసంయోగమువలన ద్రవత్వమును, తేజస్సు లోఁజేరిన సువర్ణమునం దగ్నిసంయోగమువలన ద్రవత్వము పుట్టు చున్నది. కాన పృథివీ తేజస్సులయొక్క ద్రవత్వమునకు, అగ్నిసంయో గము నిమిత్తకారణ మగుచున్నది.

పైని నిరూపించినతీరున వేనికెద్ది సాధర్మ్యమో, అదియెతద్భి న్నములగువానికి వైపరీత్యమువలన వైధర్మ్యమగుచున్నది. వైపరీ త్యమనఁగా, ఉండకపోవుట. ఇట్లు సాదర్మ్య వైధర్మ్యములను దెలిసికొన వలయును.

ఇక పృథివ్యాదులకు ప్రత్యేకముగ విశేషధర్మము నిరూపింపఁ బడును. పృథివీత్వమను జాతియొక్క సంబంధమునుబట్టి పృథివియను వ్యవహారము. ఈపృథివియందు రూపము, రసము, గంధము, స్పర్శ, సంఖ్య పరిమాణము,పృథక్త్వము, సంయోగము, విభాగము, పరత్వము,

పరత్వము, గురుత్వము, ద్రవత్వము,సంస్కారము, అనుపదునాలుగు గుణములుండును. వీనిలో శుక్లనీలాదిభేదమున నానావిధమగు రూపమును మధురాదిభేదమున షడ్విధమగు రసమును సురభ్యసురభిభేదమున ద్వివిధమగు గంధమును పాకజమగు స్పర్శయు పృథివియందు మాత్రమే ఉండును. పాకమన విలక్షణమయిన తేజస్సంయోగము.

ఈపృథివి నిత్యమనియు, అనిత్యమనియు ద్వివిధము. అందు పరమాణురూపమగునది నిత్యము. కార్యరూపమగునది అనిత్యము. కార్యరూపమగు పృథివి చిరకాలముండునదియు అవయవములు కలదియు, ఘటత్వము పటత్వము మున్నగు జాతులతోఁగూడినదియునై నీరుండుట, కూర్చుండుట మున్నగుననేకక్రియలందు సాధనమగుచున్నది. ఈకార్యరూపమగు పృథివి, శరీరమనియు, ఇంద్రియమనియు, విషయమనియు, త్రివిధమగుచున్నది. పార్థివశరీరము, యోనిజమనియు, అయోనిజమనియు, ద్వివిధము. శుక్రశోణితములనపేక్షింపక అదృష్టవిశేషముతోఁ గూడిన పరమాణువులవలనఁ బుట్టిన, దేవతలయొక్కయు, ఋషులయొక్కయు, శరీరము అయోనిజము. దుఃఖైకసాధనమగు, ఈఁగ, దోమ,మున్నగు క్షుద్రజంతువులయొక్క శరీరమును, అయోనిజమే. ఇది అధర్మసహితములగు పార్థివాణువులవలనఁ బుట్టుచున్నది. శుక్రశోణితసంబంధమువలన బుట్టినది యోనిజము.ఇది జరాయుజమనియు, అండజమనియు, ద్వివిధము.మనుష్యులు,పశువులు, మృగములు, మున్నగువాని శరీరము,జరాయుజము. జరాయువన శిశువును చుట్టుకొనియున్న మావి. పక్షులు, సర్పములు, మున్నగువాని శరీరము అండజము.

సర్వప్రాణులయొక్క, ఘ్రాణేంద్రియము కేవల పృథివీభాగములచే నారంభింపఁబడినది. ఇది గంధమును మాత్రముగ్రహించును.

మన్ను, రాయి వృక్షము మున్నగునదంతయు విషయము. ఇది పర మాణువులవలన ద్వ్యణుకము, దానివలన త్ర్యణుకము, దానివలనచతు రణుకము; ఈతీరున సిద్ధించుచున్నది. ఇటుకలు మున్నగునవి మృత్తు. వజ్రములు మున్నగునవి పాషాణములు. వృక్షములు, లతలు, ఓష ధులు, వనస్పతులు మున్నగునవి స్థావరములు. వనస్పతులన పూవులు పూయకనే కాయలు కాయునట్టి మఱ్ఱి, మేడి మున్నగునవి.

జలత్వజాతి సంబంధము కలది జలము. దీనియందు రూపము, రసము, స్పర్శ, ద్రవత్వము, స్నేహము, సంఖ్య, పరిమాణము, పృథ క్త్వము, సంయోగము, విభాగము, పరత్వము, అపరత్వము, గురు త్వము, సంస్కారము, అను పదునాలుగు గుణములుండును. స్నేహ మనఁగా జిడ్డు. జలమందు శుక్ల రూపము, మధురరసము, శీతస్పర్శ, మాత్రముండును. స్నేహము, స్వాభావిక ద్రవత్వము, జలమాత్ర ధర్మములు.

ఈ జలము పృథివివలె నిత్యానిత్య భేదమున ద్వివిధము. పరమాణు రూపమగునది నిత్యము. కార్యరూపమగునది అనిత్యము. మఱియు కార్యరూపమగు జలము, శరీరమనియు, ఇంద్రియమనియు, విషయమనియు, త్రివిధము. జలీయ శరీరము, అయోనిజమేకాని, యోనిజము కాదు. ఇది వరుణలోకమం దుండును. ఇది పృథివీభాగ ముల యొక్క సంబంధము వలన నచ్చటి ప్రాణులకు భోగసాధన మగుచున్నది. సర్వప్రాణుల యొక్కయు రసనేంద్రియము, కేవల జలభాగములచేఁబుట్టుచున్నది. ఇది రసమును మాత్రము గ్రహించును. నదులు, సముద్రములు, మంచు, వడగండ్లును, విషయ జలమనఁబడు చున్నవి.

(సశేషము)

# చరిత్ర-ఆంధ్రవాఙ్మయము

డాక్టరు. దివాకర్ల వెంకటావధాని.

కావ్యమునకును చరిత్రకును స్వరూప ప్రయోజనములలో చాల భేద మున్నది. చరిత్ర సత్యవిషయప్రధానమైనది. కావ్యము, రస ప్రధానమైనది. చరిత్రకారుఁడు జరిగినది జరిగినట్లు వర్ణింపవలయును. అతని కథనమున సత్యమునకే కాని భావనకు చమత్కారమునకుఁ దావులేదు. కవి యథార్థమే చెప్పవలెనను నియమములేదు. అతఁడు భావనాప్రేరితుఁడై తనయిచ్ఛవచ్చిన దానిని రసవంతముగను చమత్కార గర్భితముగను జెప్ప యత్నించును. చరిత్రమున విషయమున కెంత ప్రాధాన్యమో కావ్యమున దానిని చెప్పువిధమున కంత ప్రాధాన్యము. చరిత్ర చెప్పువిషయము దేశకాలపాత్రములచే నియమితమై యుండును. అనఁగా నది చెప్పువిషయ మొకే దేశమునకు, ఒకే కాలమునకు, ఒకేవ్యక్తికి సంబంధించియుండును. దానిని దేశకాలపాత్రాంతరముల కన్వయించుట కవకాశముండదు. కవిచెప్పునట్లు కాక సార్వదేశికమును, సార్వకాలికమును, సార్వజనికమును నై యుండును. అందుచేతనే రామాయణాది మహాకావ్యములు దేశకాల మర్యాదల నతిక్రమించి యెల్లదేశములందు నెల్లకాలములందు నెల్లజనులచేఁ బూజింపఁబడుట సంభవించినది. కావ్యములందు కవు లొసఁగు నామములు జాతిసూచకములు మాత్రమే. విషయమునుగూర్చి కొంతజ్ఞానమును సంపాదించుట చరిత్ర పఠనమునకుఁ బ్రయోజనము. కావ్యమునకు సద్యః పరనిర్వృతియే పరమ ప్రయోజనము. అందుచేతనే దశరూపక కారుఁడు "వ్యుత్పత్తిమాత్రం ఫలమల్పబుద్ధిః"అని చెప్ప సాహసించినాఁడు.

ఈవిధముగా స్వరూప ప్రయోజనములందు కావ్య చరిత్రములకు వ్యత్యాస మున్నను వానికిఁగల సంబంధ మతిసన్నిహితమైనది.

అవి పరస్పరాధారములై అవినాభావసంబంధము కలిగియుండును. కవి భావనాయానమున నెంతకాలము భావాంబర విహారపరాయణుండై వర్తించినను, ఎప్పుడో యొకప్పుడు భూతలమున కవతరింపకపోడు. అప్పుడాతని కావ్యమున నజ్ఞాతముగనైన భూతలము, అందలిజనులు, సంఘము, సంప్రదాయములు, ప్రకృతి, తత్పరిస్థితులు ప్రతిఫలించి దానికొక ప్రత్యేకత చేకూర్చును. అందుచే చరిత్రకారుండాయా కాలముల పరిస్థితులను వర్ణింపందలచినప్పుడు విషయ సంగ్రహణమునకై యితరాధారములను వలె వాఙ్మయమును గూడ వెదకవలసివచ్చును. అప్పుడు లభించిన వివిధవిషయమిశ్రక్షీరమునుండి చరిత్ర దుగ్ధమును వేఱుచేసి యాతండుపయోగించుకొనును. చరిత్రనిర్మాణమునకు వాఙ్మయమువలెనే వాఙ్మయ సమగ్రసమవగాహనమునకు చరిత్ర తోడ్పడుచుండును. చరిత్ర పరిజ్ఞానములేనిచో వాఙ్మయ సముద్రములోతులకుం జొచ్చి తదర్థభావరత్నముల నందుకొని యానందించుట కవకాశముండదు. అందుచే నేకావ్యమునైన పఠించుటకు మున్ను తత్కాల చరిత్రనుకూడ నెఱుంగుట మిక్కిలి యావశ్యకము. ఈవిధముగా చరిత్ర కావ్యములకుం జాల సన్నిహితసంబధ మున్నదనుటలో నత్యుక్తిలేదు.

అన్ని కావ్యములవలెనే యాంధ్రకావ్యములనుగూడ ప్రఖ్యాత వస్తుకములు, మిశ్రవస్తుకములు, కల్పితవస్తుకములు నని మూండు తెఱంగులు గావింపవచ్చును. అందుం బ్రఖ్యాత వస్తుకములలోం జారిత్రకములైనవికూడం గొన్నికలవు. అవి గద్యరూపముననుు, పద్యరూపముననుగూడ నున్నవి. క్రీ. శ. 17వ శతాబ్ది పూర్వార్ధమునకుం జెందిన కాసె సర్వప్ప సిద్ధేశ్వరచరిత్ర మనునొకచారిత్రకకావ్యము రచించెను. దీనికే ప్రతాపచరిత్రము కాకతీయ రాజవంశ మనునామాంతరము లున్నవి. నెల్లూరు నుండి తిక్కనసోమయాజి వచ్చి గణపతి దేవుని దర్శించి నట్లును, గణపతిదేవుండు సేనలను బంపి మనుమ

సిద్ధిని రాజ్య స్థాపితుని గావించినట్లును నీ గ్రంథము చెప్పుచున్నది. ఓరుగల్లు నగర వైభవమును నందలి గుడి గోపురములు, వివిధ వర్ణముల ప్రజలు ప్రతాపరుద్రుని ముఖ్యోద్యోగులు, అప్పుడు ప్రసిద్ధి కెక్కిన కవులు మున్నగు విషయములెన్నో యిందు వివరింపఁబడినవి. మహమ్మదీయుల దండయాత్రల ప్రసక్తియు నిందు గలదు, ఇందు కొంత భాగము వచన రూపమునను గొంత భాగము ద్విపదరూపముననను నున్నది. అందుగుల వెంకయ్య రామరాజీయమను నామాంతరముగల నరపతి విషయమను చారిత్రక కావ్యము వ్రాసి యార్వీటి వంశము వారి విక్రమ వైభవములు వర్ణించియుండెను. తిరుమల రాయలయు తత్కుమారుఁడైన వేంకటపతి రాయలయు పరిపాలనము లిందు వర్ణితములై యున్నవి. కుమార ధూర్జటి రచించిన కృష్ణరాయ విజయమున రాయల పరిపాలనా పరాక్రమములు వివరింపఁబడియున్నవి. ఇందారంభమునఁగల విద్యానగర నిర్మాణ వృత్తాంతము మిక్కిలి రమ్యముగా నుండును. ఇట్లే రాయవాచక మను వచన గ్రంథమున రాయలచరిత్రము వ్యవహార భాషలో వర్ణింపఁబడినది. ఇది విశ్వనాథనాయకున కజ్ఞాత నామధేయుఁడైన యాతని స్థానాపతి వ్రాసిన విన్నపమని యందుఁ గలదు. అధికారవర్గమున వాడుకలో నుండిన భాషయే యీ గ్రంథమున వాడఁబడినది. ఈకాలముననే యిట్టి భాషలోనే వ్రాయఁబడిన మఱొక చారిత్రక వచన గ్రంథమున్నది. అది యత్కర్తృకమో తెలియదు. అందలి చారిత్రకాంశముల యాథార్థ్యము పైతము కొంచెము సందేహాస్పదముగా నున్నది. క్రీ శ. 17వ శతాబ్ది చివర రచింపఁబడిన మధురమంగా పుంశ్చలీ విలాసమను గ్రంథమున చొక్కనాథుని భార్యయైన రాణి మంగమ్మ చరిత్ర మశ్లీల పదములతో మిక్కిలి నీచముగ వర్ణింపఁబడినది. ఇది యెవ్వరు రచించిరో తెలియదు. కాని యప్పటి దేశ

పరిస్థితులు తెలిసికొనుట కిది యెన్నో విధములఁ దోడ్పడును. క్రీ.శ. 18 వ శతాబ్ది చివర దిట్టకవి నారాయణకవి రంగారాయ చరిత్ర మను కావ్యమున 1757వ సంవత్సరమున జరిగిన బొబ్బిలి యుద్ధము వర్ణించెను. ఈ పై గ్రంథము లన్నియు నాయాకాలములందలి దేశ చరిత్రతోపాటు జనుల యాచార సంప్రదాయములను, సాంఘిక మత పరిస్థితులను జక్కఁగా వర్ణించుచున్నవి. వీనిలోఁ గొన్నిటి యందు కావ్యదృష్టి కూడఁబొడగట్టినను, కొన్నిటియందు విషయము నకే యధికమైన ప్రాధాన్య మొసంగఁబడినది. చరిత్రకారుల కవి చాల విధములఁ దోడ్పడఁజాలును.

ఆధునిక కాలమునఁ గూడ మూఁడు నాలు గుత్తమ చారిత్రిక కావ్యములు రచింపఁబడి ప్రసిద్ధికెక్కినవి. అందు రాణాప్రతాప సింహ చరిత్రము, శివభారతము, ఆంధ్రపురాణము, హంపీక్షేత్రము ముఖ్యములైనవి. వీనిలో వస్తువు చారిత్రక మేమైనను రచనలో కావ్యదృష్టియే యెక్కువ. వీనికిఁదోడు భారత దేశ వైభవమును, నాంధ్రరాష్ట్ర సంపత్సౌందర్యములను వర్ణించు ఖండకావ్యము లనేకము లున్నవి. కొందఱు ప్రతిభావంతు లాంధ్ర దేశ చరిత్రనుండి వస్తువును సేకరించి మనోహరములైన నవలలు వ్రాసియున్నారు. ఇందు విషయ మున కంటె కథాకథనమునకుఁ బ్రాధాన్యమెక్కువ.

పైని పేర్కొనఁబడిన గ్రంథములన్నియు చరిత్రతోఁ బ్రత్యక్ష సంబంధము కలిగినట్టివి. వానిలోఁ జారిత్రక విషయములు వర్ణింపఁ బడుటలో వింతలేదు. ఇట్టి చారిత్రక కావ్యములు కాక తెలుఁగు నందలి యితర కావ్యములు కూడ చరిత్ర నిర్మాణమున కెన్నియో విధములఁ దోడ్పడుచున్నవి. దాని కాంధ్ర కావ్య రచనా విధానము నందలి యొక ప్రత్యేక పద్ధతియే కారణము. ఆ పద్ధతి యీ

కావ్యములన్నిటికి నధికమైన చారిత్రక ప్రాధాన్యము కూడ నొసంగి చరిత్రకారుల దృష్టిని సైత మా వంకకు మరల్చుచున్నది.

ఆంధ్ర కావ్య రచనా విధానమును బరిశీలించినచో నందు బ్రధానముగా మూఁడు భాగములు గోచరించును. ఒకటి కృత్యవతారిక, రెండు, అశ్వాసాద్యంత పద్యములు, మూడు వస్తు వివరణముతోఁ గూడిన కావ్య భాగము. అధునిక కావ్యములు కొన్నిటిలో నిందలి మొదటి రెండు భాగములును గోచరింపవు. కాని పూర్వ కావ్యములన్నిట నీ విభాగ త్రయము కానిపించుచునే యుండును. ఈ మూఁడు భాగము లందును నేదియో యొక విధముగా చరిత్రాంశములను వివరించుట కవకాశమున్నది. మొదటి రెండు భాగములును గేవల చరిత్రమయములే యన్నను నత్యుక్తియుండదు.

ఆంధ్ర రాజులు తొల్లింటినుండియుఁ గవులను వాఙ్మయమును బోషించి ప్రసిద్ధి కాంచిరి. అది వారి కొక విలాసము. మఱియు వారి రసజ్ఞత కొక గొప్ప నిదర్శనము. ప్రతిభావంతుఁడై కవి యెవరైన రసవంతమైన కావ్యము వ్రాసిరని యెరింగి నప్పుడు వారతనిని సభకాహ్వానించి, కావ్యము విని, యథోచితముగా సన్మానించెడివారు. కొందరు రాజులు తమ కభిప్రేతమైన విషయమును దామే సూచించి దానినిగూర్చి యొక కావ్యము వ్రాయవలెనని తమ యాస్థానములందలి కవులను గోరెడివారు. ప్రభువుల యభిలాష ననుసరించి కవులు కావ్యములు వ్రాసి పండితసభా మధ్యమున వారికి వినిపించి యుచిత సత్కారము లొందెడివారు. ఇట్టి సందర్భముల వా రా వావ్యములను గృతజ్ఞతా పూర్వకముగా నారాజుల కంకితము చేసెడివారు. రాజు తమ్మాహ్వానించి కావ్యము వ్రాయుమనికోరి కర్పూర తాంబూలము నొసంగి గౌరవించు వృత్తాంతము కృత్యవతారికలందలి యొక భాగము. తరువాత నీ యవతారికలో ప్రముఖముగా కని

పించు భాగము కృతి పతి తద్వంశ వర్ణనము. కొన్ని కావ్యములలోఁ గృతి కర్త్రు వంశాభి వర్ణనములును గానిపించును. ఈ వర్ణన భాగములు నిజముగా చరిత్రవే. వీనియందుఁ గృతిపతి యేవంశమునకు జెందినదియు, నావంశమునందలి యేయేరాజు లెప్పుడెప్పుడెట్లు పరిపాలించి యేయే ఘనకార్యము లొనరించినదియు వర్ణింపఁబడియుండును. ఇందాలంకారికములైన యసత్యములు కొన్ని యున్నను జారిత్రకాంశములు పూర్తిగా విస్మరింపఁబడవు. ఈ భాగములు చరిత్రకారుల కెంతేని యుపకారకములుగా నుండును.

తిక్కనసోమయాజి నిర్వచనోత్తర రామాయణమును మనుమసిద్ధి భూపాలునకును, ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమును బ్రోలయ వేమారెడ్డికిని, శ్రీనాథుఁడు కాశీ ఖండమును వీరభద్రారెడ్డికిని, పెద్దన తిమ్మనాదులు తమ ప్రబంధములను గృష్ణదేవరాయలకును, రామరాజభూషణుఁడు వసుచరిత్రను దిరుమల రాయలకును, పింగళి సూరన రాఘవపాండవీయము నాకువీటిపెద్దతిమ్మరాజునకును, కళాపూర్ణోదయమును నంద్యాల కృష్ణరాజునకును, తెనాలి రామకృష్ణుఁడు పాండురంగమాహాత్మ్యమును, విరూరి వేదాద్రి మంత్రికిని, చేమకూర వెంకటకవి తన సారంగధర విజయ విలాసములను రఘునాథ భూపాలునికిని సంకితము కావించిరి. ఈ కావ్యముల యవతారికలలో నా యా కృతి పతుల వంశములును, అందలి రాజుల గుణగణములును వర్ణింపఁబడియున్నవి. వీనిని బట్టి యా వంశముల చరిత్రములును, ఆ కృతిపతుల చరిత్రములను నిర్మించుట కవకాశమున్నది.

పింగళి సూరన్న ప్రభావతీ ప్రద్యుమ్నమును దన తండ్రి పేర సంకితముచేసి యా విధముగా దనవంశము నంతను వర్ణించుకొనెను. రాజులు, కవుల నాహ్వానించి వారిని కావ్యములు వ్రాయఁగూడు

నప్పుడు వారి వంశమునందలి పూర్వులను వారు ప్రదర్శించిన కవితా ప్రతిభలను వర్ణించుట కానఁబడును. ఈ విధముగాఁ గావ్యారంభము లందలి యవతారికలు రాజులకును, కవులకును సంబంధించిన పెక్కు చరిత్రాంశములను వెల్వరించుచున్నవి. రాజుల పౌర్వాపర్యములను కవుల కాలములను నిర్ణయించుటకీ వంశ వర్ణనము లెంతేని యుపయోగ పడుచుండును.

ఇట్లే యాశ్వాసాద్యంతము లందలి పద్యములు కృతి పతులను గూర్చి పెక్కు విషయములను దెలుపుచుండును. ఈ పద్యములు సాధారణముగా సంబోధనాంతములై యుండును. ఆశ్వాసాది యందొక పద్యమును, నంతమున మూఁడు పద్యములును గానఁబడును. వీని యందు కృతిపతుల గుణగణములు, వారొనరించిన జైత్రయాత్రలు, ఘనకార్యములు వర్ణింపఁబడును. వీనినిఁబట్టి వారి సామాన్య శీలమే కాక మతము,కులాభిమానము,పరాక్రమము మున్నగువానిని గుర్తింపవచ్చును. రాయలవారి యాముక్తమాల్యదలోఁ బ్రథమాశ్వాసము చివరను,

"ఇది సింహాచల దంభకేసరి పదాభీష్టార్చనాపుణ్య ల
బ్ధ దురుట్టంకణ పొట్టునూరివిజయ స్తంభోపలోట్టంకితాం
క దృఢాష్టాక్షరకృష్ణరాయ ధరణీకాంతాస్మదాముక్త మా
ల్యద నాశ్వాసవరంబు నారవది హృద్యంబై మహిం బొల్పగున్."

వంటి పద్యములు రచింపఁబడినవి. ఇవియు నాతనిఁ గూర్చిన చారిత్రకాంశముల నెన్నింటినో వ్యక్త మొనరించుచున్నవి.

కవు లప్పుడప్పుడు గ్రహించు కావ్య వస్తువులను బట్టియు తత్స్వభావములను బట్టియు నప్పటి మతచరిత్రము నూహింపవచ్చును. నన్నయ దివంగతుఁడైన పిమ్మట తిక్కన మరల భారత రచనమును నుపక్రమించుటకు సుమారు నూటయేఁబది సంవత్సరములు పట్టినది

ఈమధ్యకాలమున పాల్కురికి సోమనాథుఁడు మున్నగు శైవ కవులు శైవమత ప్రతిపాదకములను, శివపారమ్య బోధకములునైన కావ్యములు రచించిరి. దీనినిబట్టి యాకాలమున వర్థిల్లిన శైవమత విజృంభణము నూహింపవచ్చును. తిక్కన తన భారత భాగములను హరిహర నాథదేవున కంకిత మొనర్చి శివకేశవాద్వైతమును స్థాపింప యత్నించి కృతార్థుఁడయ్యెను. రాయల వారి యాముక్తమాల్యదను, పెద్దనాదులు తమ ప్రబంధములం దొనరించిన దశావతార వర్ణనాదులను బరికించిన నప్పటి వైష్ణవ మత ప్రచారము వృత్తాంతము వ్యక్తమగును. వేమన రచించిన పద్యములను బఠించినచో నానాఁడు మతాచార్యులు మతాధిపతులు తదితరులు మతము పేర నొనరించుచుండిన దురాచారములు విదితములగును. క్రీ. శ. 18వ శతాబ్ది యుత్తరార్థమున మంగళగిరి యానందకవిబ్రాహ్మణుఁడయ్యు క్రైస్తవమత మవలంబించి వేదాంతరసాయన మను గ్రంథమును రచించి తననలెనే క్రైస్తవుఁడైన నిడిమామిళ్ళ దాసామాత్యున కంకితము కావించెను. ఇట్లే పింగళ యెల్లనార్యుఁడు సర్వేశ్వర మాహాత్మ్య మనుపేర తోభ్యచరిత్రను రచించెను. వీనివలన నాకాలమున దేశములో క్రైస్తవమత మెట్లువ్యాపించెనో తెలిసికొనవచ్చును.

కవులు కథను నందలి పాత్రములను వర్ణించుచుఁ దమకాలమున వర్థిల్లు వివిధ ప్రవృత్తులనుగూడ గూఢముగా వర్ణించుచుందురు. ఈ వర్ణనలను బట్టి ప్రజల వేషభాషలు, ఆచారములు, గాన నృత్య చిత్ర లేఖనాదులందుఁగలయభిరుచివిశేషములు, వారి చిత్తవృత్తులు మున్నగు సాంఘికవిషయము లెన్నిటినైన తెలిసికొనవచ్చును. ఆంధ్ర దేశ సాంఘిక సాంస్కృతిక చరిత్ర నిర్మాణమున కాయా కాలములందుఁ గవులు రచించిన కావ్యములే ప్రధా నాధారములగు నను టలో నతిశయోక్తి యుండఁజాలదు.

ఆంధ్రమున విస్తృతమైన శతక వాఙ్మయము కలదు. పాల్కు రికి సోమనాథుని కాలము మొదలుకొని నేటివరకును రచింపఁబడిన శతకముల సంఖ్య మరొకసహస్రముండును. శతకములు కథా సంబంధములేని ముక్తక రచనలు, వీనిని నీతి, భక్తి, వ్యాజస్తుతి, తత్త్వశతకములని నాలుగు విధములుగా విభజింపవచ్చును. ఇవి సాధారణముగా నాత్మాశ్రయములై యుండి కవుల యాత్మీయ ప్రవృత్తులను జిత్తవృత్తి పరిణామములను జక్కఁగా వర్ణించుచుండును. వీనివలన మతచరిత్ర సాంఘిక చరిత్ర కూడ తెలిసికొనుట కవకాశములున్నవి. అందును వ్యాజస్తుతి శతకములు రచనా భావ సౌష్ఠవముచే నాకర్షకములై యుండుటే కాక తత్కాల మత రాజకీయ పరిస్థితులు నద్దమునవలెఁ బ్రతిఫలింపఁజేయుచుండును. గోఁగులపాటి కూర్మనాథకవి సింహాద్రి నారసింహ శతకమును, భల్లా పేరయ్య భద్రగిరి శతకమును, కాసుల పురుషోత్తము ఆంధ్రనాయక శతకమును, మట్లపల్లి నృసింహశతకము, వేంకటాచల విహార శతకము మున్నగు నితర శతకములును, ఇందుకు నిదర్శనములు.

సంస్కృతమున లక్షణ గ్రంథమైన ప్రతాప రుద్రీయము నెరుగని వారుండరు. అది లక్ష్యలక్షణములతోఁగూడిన యలంకార గ్రంథము. అందు ప్రతి లక్షణమునకును లక్ష్యముగాఁ బ్రతాపరుద్రుని గుణ గణముల వర్ణించు పద్యమొకటి లక్ష్యముగానుండును. దీని ననుసరించి వ్రాయఁబడినదే కావ్యాలంకారసంగ్రహమను పేరు గల నరసభూపాలీయము. ఇందలి లక్ష్యములను బట్టి నరసభూపాలుని గూర్చియు నతని వంశమును గూర్చియుఁ బెక్కువిషయములను గ్రహింపవచ్చును. అట్లే యలంకార గ్రంథములు కూడ చరిత్ర పరిజ్ఞానమునకుఁ దోడ్పడును. ఇవి గాక వెలుగోటి వారి వంశ చరిత్ర

వంటి వంశచరిత్ర వర్ణనాత్మకములైన గ్రంథములు కొన్ని గలవు. పేరే వీని చారిత్రక స్వభావమును వెల్లడి చేయుచున్నది.

ఈ విధముగా గావ్యములకును, చరిత్రకును సన్నిహిత సంబంధము కలదని గ్రహింపవచ్చును. కవులది ప్రధానముగా కళారస దృష్టియే యైనను బరోక్షముగా వారి కావ్యములు చరిత్రాంశములను గూడ వెల్లడిచేయుచుండును. అందుచే గావ్యోద్యానములందు చరిత్ర చరణాంకములు స్పష్టముగా గోచరించుచునేయుండును.

— o —

# శివరాత్రిమాహాత్మ్యము—కావ్యత్వము

(కథసంచిక తరువాయి)

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

## సరోవరవర్ణనము

సుకుమారుఁడు పురనిష్కాసితుఁడై కాంతారమధ్యమున క్షుత్పిపాసాతురుఁడై యున్నసమయంబున, అది నెఱిఁగి తనకుఁ దృప్తికరముగఁ జలిదియన్నముఁ దినవిచ్చు జనని జ్ఞప్తికి వచ్చి యీ క్రిందివిధముగ వాపోయినాఁడు.

అరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం గనుపట్ట గిన్నెలో
బెరుగును వంటకంబు వడపిందియలునుం గుడువంగఁ బెట్టుని
ర్భరకరుణాధురీణ యగు ప్రాణము ప్రాణము తల్లియున్నదే
హరహర యెవ్వరింకఁ గడుపారసి పెట్టెద రీప్సితాన్నముల్.

గృహనిష్కాసితుఁ డయిన గుణనిధినిసైత మీ పద్యముతోడనే వాపోవఁజేసినాఁడు. ఇట్లు వాపోవుచుఁ జనిచని ముందట సుకుమారుఁ డొక సరోవరమును గాంచెను. ఇచటి సరోవర వర్ణన క్రమము బాణుని అచ్ఛోద సరోవర వర్ణనమునకుఁ బ్రతిరూపము. బాణుని కల్పనలను జాలవఱకు నిచటి కవతరింపఁ జేసినాఁడు.

సీ. స్ఫటికరత్నగృహంబు సర్వంసహాకాంత
కభిధాంతరంబు దుగ్ధాంబునిధికి
మణిదర్పణము నభోమణి మార్గలక్ష్మికిఁ
జంద్రాతపమునకు జన్మభూమి
యర్ధేందుమకుటాట్టహాసంబునకు జోడు
పౌలస్త్యగిరికి సబ్రహ్మచారి
ప్రతిబింబ మభ్రముప్రభువారణమునకు
నసుఁగుఁ జుట్టము శారదాభ్రములకుఁ
గమఠతిమినక్ర విక్రమ క్రమవిహార
చటులతర వీచికాఘటా సమదరూఢ
హంసకుల సంసన్నినాద సంవ్యాప్తదిగ్వి
భాగ మీక్షించె నతఁడు తటాక మెదుర.

ఆ సరోవర మాయవనిబృందారకునకుఁ బంచేంద్రియములకు సంతృప్తిని గలిగించె నని తెలుపు క్రమముకూడ చక్కని కల్పనతోఁ గూడియున్నది. వైదూర్యమణిసమానమైన నీరు కన్నులకు, తరంగ సంస్పర్శశీతలమయిన వాయువు త్వగింద్రియమునకు, బద్మరేణు పరాగసౌరభము నాసేంద్రియమునకు, కలహంస కలకలారావము శ్రవణేంద్రియమునకు' తీయని నీరు నాలుకకు సంమోదము గలిగింపఁ జేసె ననుటలో కల్పనలో సౌకుమార్యము తొలఁకాడుచున్నది. ఇచటి భావానుగుణపదసంయోజనముకూడ సుకుమారతరము.

సీ. వైదూర్యమణిశిలాస్వచ్ఛోదకము గాఁక
　　　గౌతుక బొసరించెఁ గన్నుఁగవకు
శిశిర సంస్పృష్ట వీచి మారుతము గాఁక
　　　నంగకంబులకు నింపావహించెఁ
గమలకేసరరేణు గంధోల్బణము గాన
　　　ఘ్రాణేంద్రియమునకుఁ బ్రముద మొసఁగెఁ
గలహంసకుల కలకల కులాయము గాన
　　　శ్రుతిసంపుటమునకు సుఖము నిచ్చె
(మధుర) సలిలంబు సమ్మోద మొదవఁ జేసె
నాలుకకు నప్పు డవనిబృందారకునకు
సైకతారూఢ జలమానుషీకదంబ
కాంక్షితార్కమయూఖంబు కమలవనము.

ఇచ్చట సుకుమారుని చేతను మాలెతచేతను సరోవరమున సలిలక్రీడ గావింపఁ జేసినాఁడు. ఈ చేయించుటలో జల్లులు చిలుకులు లేవుగాని సుకుమారముగ తద్భావానుప్రవేశము మాత్రము కలదు. ఆక్రమ మెట్లుసాగెనో కనుఁగొందము.

వసుధానిర్జరుఁడు న్మహాసరసిలో వార్థ్యచులం దేలెఁ ద్రా
వె సుధాసన్నిభమైన వారిఁ దటపృథ్వీజావళిచ్ఛాయలో
వసియించె న్లహరీసమీరముల నధ్వశ్రాంతి పోకారిచె
న్విపకాండంబులు మేనఁ గూర్చెఁ జలువ ల్నిర్మోకసంకాశముల్.

మాలెత విప్రునితోఁ గొంతవఱకు ప్రసంగము గావించిన వెనుక, బాలయయ్యను ప్రౌఢవోలె నాతనిఁ జూచి, 'చాటువడి యుండుమయ్యా యీ సరసిలోన నుదకమాడెదఁగాక పిన్నదియు నేను' అని పలుకుచు కొలనికి డిగఁ జని, వనకేళిఁ దరంగ లురుస్తన భరాస్ఫాలనమున జర్ఝరములుగా సఖియుఁ దానును జలకమాడె'నని తెలిపియున్నాఁడు. ఈ క్రమము.

'ఒకచోటఁ బీతాంబికోన్నత స్తనభరాస్ఫాలజర్ఝరితకల్లోల యేల' యనుభీమేశ్వర పురాణమునందలి వర్ణనమును దలపింపఁ జేయుచున్నది.

## మధుపానము

సుకుమారుఁడు పారదార్యమునకుఁ బాల్పడి, తదితరవ్యసనములకుఁ గూడ లోనయ్యె నను విషయము నెఱింగించునపుడు మధుపానప్రసక్తిఁ దెచ్చి, దానినెంతయు జిత్రముగఁ జిత్రించినాఁ డీ కావ్యమున.

'చేతోజాతు నుపాశ్రయించెదఁ బరస్త్రీల న్వినోదించెదన్
మాతంగీపరమేశ్వరిం గొలిచెద న్మద్యంబు సేవించెదన్'

అని సుకుమారునిచే ననిపించుటలో, పరమేశ్వరీ సమర్చనాంగముగా మద్యము సేవించుపరిపాటి శ్రీనాథుని నాఁటను గలదను విషయము సూచితమయినది. ఆనాఁడు శక్త్యుపాసకులలోఁ గొందఱు మధుపానము సేయుచుండెడివా రను విషయము నీ క్రింది వాక్యములు కూడ తార్కాణించుచున్నవి.

"చంద్రికావేళఁ బరిపాండు సౌధవీథి
శక్తిఁ బూజించి దేవీప్రసాద మధువు
పుచ్చుకొని విప్రుఁ డాకంఠపూరితముగ
తెలిఁ దులుం దాను నప్పుడు వినిమయముల

మఱియు నాసవ మహత్త్వ మీ సుకుమార చరితమునఁ గడు విలక్షణముగఁ జిత్రింపఁబడినది. శ్రీనాథుని భావనాపటిమ యీ

క్రింది సీసమునం దద్భుతముగఁ జూపట్టినది. దీనిని కేవలము దేవతోప యుక్తమైనట్లు నిరూపించుటలో శ్రీనాథుని కావ్యశిల్పము నందంత టను గానవచ్చెడి యీశ్వరార్చనకళాశీలత్వము మఱింత ప్రస్ఫుట మయినది.

సీ. కల్పద్రుమంబులోఁ గామధేనువుతోడ
    నమృతాబ్ధి నవతార మయ్యె నెద్ది
బృందారవనమధ్య మందారతరులలో
    హాలపాణి కెద్ది ప్రత్యక్షమయ్యెఁ
ద్రిపురాంతకుని యర్ధదేహంబునకు నెద్ది
    మదన సంఫుల్ల సంపత్తి యయ్యె
నవసుధారూపమై పవనభుగ్భవనాధి
    పతి కెద్ది ప్రాణంబు ప్రాణమయ్యె
నట్టి భవభేషజము నాసవామృతంబు
గన్నుఁ గానక శపియించెఁ గాక యొకఁడు
తత్సమానములగు పదార్థములు గలవె
భూత భావి భవత్కాలముల ధరిత్రి

మద్యపాయులకు మద్యముకంటె నుత్తమము ఆస్వాదయోగ్య మునగు పదార్థము వేఱొకటి యుండదనుట ప్రత్యక్షసిద్ధము. దాని కింతటి మహత్వమును గల్పించి, ఎన్నియో పౌరాణిక గాథలను గుంఫించిపెట్టుటలో మాత్రము భావనామయసృష్టి యద్భుతము. సుకుమారుఁడు సర్వధా పతితుఁడగుటకును, పరమేశ్వరుని పాలిపడుఁ డగుటకును మద్యపానమే మూలమగుట యొకచిత్రము. సుకుమారుని పతితత్వము పరాకాష్ఠనందినది మాలెతతోఁ గాక తత్సుతలతోఁ గూడ క్రీడించుటయే. తత్ప్రవృత్తికిఁ గారణ మిట్లు వాకొనఁబడినది.

క. ఎనుబదియేడుల వార్ధక
మునఁ బ్రాక్తన శక్తి యుడిగిపో దాతనికిన్
దినియెడిది పెద్ద మాంసము
గొనియెడిది కల్లు మనసు గ్రొవ్వుటకున్.

తుదిని మదిరామదాతిరేకమే సుకుమారుని నిర్వేదమునకు మూలమయినది. తన్మదావేశమున నవశస్థితిలో నాగేశ్వర పూజాది దర్శన మాతని సకలాఘములు తొలఁగుటకుఁ గారణమయినది.

క. కుడిచేత మాంసఖండము
లెడకేలను మద్యరససహిత మగుకరకం
గుడుకయు ధరించి మదమున
వడవడఁకులు గొనుచు నతఁడు వచ్చెగ్గుడికిన్.

మద్య మాంసములు రెండును కుడియెడమచేతులఁ దాల్చి, మదిరా మదాతిరేకంబునఁ దన్నుఁ దానెఱుంగని స్థితిలో నాగేశ్వరుని దర్శించి యాలింగమున మెందుకొనియున్న పుండరీక పూజఁ గనుంగొనిన సుకుమారుఁడు నిర్విణ్ణుడై క్రమముగ శరీరమువదలి పారిపదుఁ డయ్యె ననుటలో నీ మధుపాన మదాతిరేకమే కారణమైనది. ఇట్టి వర్ణనము లేవియయినను గావ్యప్రధానఫలమున కనుబద్ధములై సాగినవి.

## రతోత్సవము

మహాకావ్యత్వము సిద్ధింపఁజేయుటకు రతోత్సవమిం దాసూత్రితమైనది. కాని యది మిక్కిలి సంయతముగ సాగినది. సురత వర్ణనము నుపక్రమించిన పట్టులో నిట్టిసంయమనము పాటించుట కవిమాత్రునకుఁ గష్టసాధ్యము. ఆక్రమమెట్లు సాగునో పరికింతము.

"ఒక్కనాఁ డతండు నదియు...బహుళ పక్షంబు నాఁటి రాత్రిఁ గాళికా గోష్ఠంబు కెలన జీర్ణోద్యానంబు నడుమ నక్తమాల తరుషండంబులోఁ దార కల్పించిన సంకేత స్థలంబునం దృణకుటీరంబునం గోద్రవపలాశ పర్యంకంబున మదిరామదోద్రేక సంభవంబైన మదనావేశంబున మనోభవశర సీత్కారంబులం బోలె సీత్కారంబుల వెలినను, బంచబాణ మాణిక్య కంకణ క్వణితంబగు నప్పుడు ..."

మాలెత కనుఁగొలఁకులందు బాష్పముదయింప విరహవేదనావిషయిక ప్రస్తావన గావించె ననినాఁడు. సీత్కారమణితములమాత్ర

ప్రవేశముతో రతోత్సవమును సంయతముఁ జేసి వదలుట అష్టాదశ వర్ణనాపరిపూర్తికి మాత్రమే.

## విప్రలంభము

సుకుమారుఁడు మాలెతను వలచి, యామెతో రహస్యక్రీడలఁ దనియఁ జేయుచుండ, హంరాణమండలములో నాతని కపకీర్తి వొచ్చి, యాతఁ డాతావు వదలిపోవలసివచ్చెను. అది యోజించి చండాలాంగన విరహావ్యథ నందెనని వర్ణించు తీరు చిత్రముగ సాగినది.

గీ॥ భామ హృదయంబుమీఁద హస్తమును వైచె
నతఁడు తనుఁ బాసి యేఁగునో యనెడు భీతి
నుల్లమునయందు వసియించియున్న తన్ను
వెడలిపోకుండ నడ్డు పెట్టెడి విధమున.

సుకుమారుఁడు తన్ను వీడిపోవునేమో యను భీతిచే, హృదయములో నుండిన యాతనిఁ బోకుండ నడ్డుపెట్టెడి విధమున తన యెడఁదపైఁ జేయి వైచెనఁట. పిమ్మట నా చండాలి యాతని విరహమున కోర్వఁ జాలనని తెలిపిన విధాన మంతయు నుదాత్తభావసంవళితమై కాళిదాసుని విరహవర్ణన క్రమమును దలపింపఁ జేయు నదియై నెగడినది.

గీ॥ ఎట్లు వేఁగింతు సంసారమిచట నుండి
యేల నినుఁ బాసి యొంటినాకిచట నుండఁ
గలుగ నిమ్ము పెక్కండ్రు బంధులును నాకు
బంధువు గలండె నాకు నీ వంటి వాఁడు

శా. ఇచ్చోట న్మధుపాన గోష్ఠి సురతం బిచ్చోట సంగీతకం
బిచ్చోటం బరిహాటి నీ కల కలం బిచ్చో మనోజోదయం
బిచ్చో నంచు భవద్వియోగమునఁ దానెవ్వారికిం బ్రీతిగాఁ
జచ్చున్ మన్మథవేదనానలమునం జండాలి విప్రోత్తమా!

మ. కరవీర ప్రసవచ్ఛదారుణ రజః కాషాయ వస్త్రంబుతో
శరతూలచ్ఛవియజ్ఞసూత్రములతో జాంబూనదస్ఫూర్తిత
స్ఫురమ్యత్నా నిటలోర్ధ్వ పుండ్రకముతో సాక్షాచ్ఛుకబ్రహ్మతోఁ
దరమా నిన్ను మహాత్మ! ఒకపడ సందర్శించినం జాలదే!

విప్రవేష మహత్త్వ మీ పద్యమున నిరూపితమైనది. దానితో పాటు చండాలికి సుకుమారుని ప్రథమదర్శనమునం దెట్టి సద్భావము కలదని తెలిపియున్నాఁడో దాని నిచట నిలువరించినాఁడు. మాలెత కాతని విప్రవేషమే పరమాకర్షకమై, యాతని వియోగమును దుర్భరముగాఁ గూర్చిపెట్టినదనినాఁడు. మఱియుఁ దత్ప్రసంగము నీ క్రింది విధముగ సాగింపఁజేసి యున్నాఁడు.

ఉ. ధీరత పూని నీవు పరదేశము వోఁవగ నేను రాక యీ
యూరన యుంటినే ద్విజకులోత్తము నిత్యముఁ గాళికాగృహ
ద్వార వితర్ది కాస్థలము దవ్వులఁ జూచిన యప్పుడెల్లనో
కూరిమి పేర్మి గుండియ దిగుల్ల నితల్లడమందు నోసుమీ

తుదికి నామె యీ క్రింది విధముగఁ బ్రతిన గావించినది.

సీ. పద్మాకరమునకుఁ బసుపాడఁ దెచ్చిన
వైరంబు చలము సాధ్యంబు గాఁగ
ననురాగ రసమునా మనములో నూర్చిన
నయనేంద్రియములకుఁ బ్రియము గాఁగ
విడువ నిన్నెన్నఁడు విశ్వసింపవె యన్న
నీ సత్యమునకుఁ బున్నియము గాఁగ
నిక్షుకోదండ మెక్కిడి బాణ మఱిపోయు
కందర్పునకు మహాఖ్యాతి గాఁగ
నెపుడు నీవు నమంబాసి యేఁగి తిపుడె
నీరసైనను నురిసైన నెగడి సైప
విడుతుఁ బ్రాణంబు లపుడ నీ యడుగులాన
పలుమఱును బెక్కుమాటలు పలుక నేల ?

ఇది సంభావితవిరహావర్ణన క్రమము. దీనిలో రసస్ఫూర్తి కనువైన భావసంయోజన మాయోజితమైనది. నీవు నను వదలి పోయిన ప్రాణవియోగముచేఁ బ్రణయమును సార్థకము చేసికొందు నని యామెచే ననిపించుటలోను, పూర్వానుభూత ప్రణయ చిహ్నములు దుర్భర వియోగవ్యథ నాపాదించు ననుటలోను నీ విరహావర్ణన మా మాలతి శీలమును మఱింత యుదాత్తము చేయుటకు సహకరించినది.

వివాహ వర్ణనమున కీ కావ్యమునఁ బ్రసక్తి రాలేదు.

కుమారోదయ వర్ణనము — సుకుమారుని జన్మ క్రమమును వర్ణించు ప్రకరణమున నీ ప్రబంధమునం దతివిస్తృతముగ వర్ణితమయినది.

ద్వితీయాశ్వాసమున 16 వ పద్యము మొదలు 80 వఱకు సాగినది.

## యుద్ధవర్ణనము

ప్రథమాశ్వాసమున హార్యజుల యుద్ధవర్ణనము, చతుర్థాశ్వాసమున శివదూత యమదూతల యుద్ధవర్ణనము రౌద్రరస భావ సమన్వితముగ వీరరస పర్యవసాయిగా నిర్వహింపఁ బడినది. శివరాత్రి మాహాత్మ్యము నందు వ్యాపకమైన కథ సుకుమార చరిత్రము. దానికి బ్రధాన నాయకుఁడు సుకుమారుఁడు. తదభ్యుదయము పతితత్వము నుండి పారిషదత్వము లభించుటగా నిర్వహింపఁబడినది. ఈ క్రమమున నీ ప్రబంధము నందష్టాదశ వర్ణనలు జతగూడి ప్రతిజ్ఞానుసారముగ మహాకావ్యత్వ మేర్పడినది.

మచ్చున కొక్క పద్యము నుదాహరించెదను.

మంగళరత్న దీపములమధ్యమునం బురుటింటిపాన్పుపై
నంగజసన్నిభుండు సచివాగ్రణినందనుఁ డొప్పె నెంతయు
న్నింగిఁ బ్రదోషవేళ నతినిర్మలతారకచక్రవాళముల్
సంగతిఁ జుట్టునుం గొలువఁ జాలఁగ నొప్పు శశాంకుకైవడిన్. శివరా. 2-73.

శ్రీనాథుఁ డేరసమును నిర్వహింపసమకట్టినను దానికి సరిపడిన వస్తు భావపదసన్నివేశమును సమకూర్చుకొనును. శృంగారరస నిర్వహణమునం దెట్టిప్రణిధానమును ఔచిత్యమును బాటించునో, వీరరౌద్రాది రస నిర్వహణమునందును నాక్రమమునే పాటించును. యుద్ధవర్ణన మనునది రౌద్రరససహకృతమైన వీరరసభావముల నాయోజించుట కనుకూలమైన నెలవు. యమకింకరులు శివకింకరులు యుద్ధమునకుఁ దలపడినప్పుడు ముందుగ శివదూతల సమరోత్సాహము నీ క్రింది విధముగ వర్ణించి, యా వెనుక నారభటీవృత్తి సమన్వితమై నీ పద సంయోజనలో ఆహవము జరిగినతీరు నిట్లు వర్ణించియున్నాఁడు.

సీ. పాడికచ్చడములపై బులితోలునునుసేలు
కటిభాగమునఁ గాసెకట్టు గట్టి
యభినవంబైన రుద్రాక్షయొడ్డాణంబు
నాభిచక్రములోనుగా ధరించి
ప్రిదిలి జారకయుండఁ బెనుఁబాఁపప్రోగులు
శ్రవణభాగంబునందు సంతరించి
యల్లిబిల్లిగ జటావల్లీమతల్లులు
గూర్చి పెంపొందఁ గీల్కొప్పు వెట్టి
భసితధూళి శరీర మభ్యంగమార్చి
యుద్ధవిధిఁ బారిషదయోధు లొక్కఁడొకఁడ
యాయుధంబులు ధరియించి యట్టహాస
డమరుకధ్వానసింహనాదములతోడ

శివ 4:72.

శా॥ ఆటోపారభటీసముద్భటకటాహంకారబాహాభుజ
ర్జ్యాటంకారరవంబు లంబుజభవాండాభ్యంతరంబు న్సమా
స్ఫోటింపంగ లలాటలోచనభుజిష్యుల్దడభృద్భృత్యులన్
ఘాటీసంభ్రమలీలఁ దాఁకిరి కడిన్ ధారాధరాధ్వంబునన్

ఈశార్దూలముపరుషవర్ణవికటబంధమై యారభటీవృత్తి కనుకూలమైన నడకతో సాఁగినది. టకారబహుళమై వర్గద్వితీయ చతురాక్ష

సమన్వితమై శార్దూలహుంకారములను వినిపింపఁజేయుచున్నది. రసో-చితమైన ఛందస్సంయోజనముగూడ నిటఁ జతఁ గూడినది. ప్రమథ వర్గము దండధరభృత్యుల నత్యాగ్రహముతోఁ దాఁకినప్పటి యాటో-పమును వర్ణించిన క్రమముగూడ నీతీరుననే నడచినది.

సీ॥ ద్రాఘిష్ఠకఠిన దంష్ట్రాదండసంఘట్ట
కటఘోరకిటకిటాత్కార మగుచుఁ
జటుల ఝంఝామరుజ్ఝంపాపరంపరా
సన్నిభఘ్రాణనిశ్వాస మగుచు
వికలతారకచక్రవిభ్రాంతిభీషణ
స్ఫారచక్షుర్ద్వయీభయద మగుచు
నిటలవీథివిటంక నిర్భరభ్రూకుటీ
నటనక్రియాటోపపటిమ మగుచుఁ
గాలమృత్యువు శాణచక్రముఁ బట్టి
చికిలిచేసిన యడిదములచేతఁ దాల్చి
జేగురించిన మొనగములతోఁ జిత్రజాగ్రి
ప్రమథవర్గము దాఁకె వాగ్రహ మెలర్ప.

ఈ పద్యమున రౌద్రరసాటోపము మఱింత పొంగులు వాఱినది. సంధానయోగ్యమయిన యక్షరములతోపాటు భయానకరస సముద్భూతి సముచితపదములు జతఁగూడినవి. దంష్ట్రాకిటకిటాత్కారము, ఝంఝావాతసదృశమైననిశ్వాసపాతము, భీషణతారకభ్రమణము, భ్రూకుటీకౌటిల్యము ననుచేష్టలన్నియు నెదుట సాక్షాత్కరించునట్లు తేర్పడినవి. ఈ సన్నివేశమునందలి రౌద్రరసాటోపముకూడ నితరరస భావసమకక్షముగనే సాగినది. ఈ విధముగ సమరసన్నాహమును వర్ణించి, యుద్ధము జరిగిన తీ రిట్లు చిత్రించినాఁడు.

దినకరచ్ఛాయాచ్ఛేదాధిగమమున ధగద్ధగితములగు నిస్త్రింశ కుఠారాద్యాయుధదీప్తులు రణలక్ష్మి నివాళింపఁగ, నవుడు విద్యాధరపన్నగయక్షగరుడగంధర్వాదులు మది నాహ్లాదింపఁగ సురముని కరంచె యాడింపఁగ, భవుని వెంకట శమనకింకరులును భావావష్టంభ

విజృంభణ మప్రతిహతముగ నొందురువులఁ దాఁకిన ఛండనంబు ఘో
రంబయ్యెన్.

క. శంకరభటులను సంతత
కింకరులు మిథః ప్రహారకీలాలసటా
పంకిలతను అయి కుసుమిత
కంకేళీతలభంగిఁ గనుపట్టి రనిన్.

శి. 4-52, 76.

సుమునియాజ్ఞతోఁ బునరుద్రిక్తులై ప్రమథులను దాఁకిన యంతక భటులయాటోపమును గూడ పై దానికి సమమైన పద్ధతిలోనే యొక విపులమైన గద్యములో నడిపించియున్నాఁడు. *యమకింకరుల కోటమి కలుగవలయునుగాన, ప్రమథపక్షమునవలెఁ గాక గద్యమున నడిపించు టలో నొకవిలక్షణమైన యౌచిత్య మేర్పడినది.

* చూ. శివరాత్రి మహాత్మ్యము. 4-83.

జలక్రీడ:- మాలెత తనసకియతోఁ గూడి, కొలనిలోనికిఁ జొచ్చి ఋతుస్నాన మాచరించె నని తెలిపినప్రకరణములో సలిలక్రీడను నిర్వహించియున్నాఁడు. గ్రంథారంభమునఁ గావించినప్రతిజ్ఞను నిర్వహించుటలో నేవిషయము గొఱవడకుండఁగనే నిర్వహించె ననుట కిది యొకనిదర్శనము.

క. అని పలుకుచుఁ గొలనికి డిగఁ
జని మాలప్రమద దాను సఖియు నొవర్చెన్
ఘనకేళితరంగ లురు
స్తనభారాస్ఫాలనమున జర్జరములు గాన్

శి 3-42.

పండాలి, సుకుమారుని జాటువడియుండు మని పలికి, కొలనిలోఁ బ్రవేశించి, తానును జెలికత్తెయు, తమపెద్దవా నురోజముల రాపిడిచే తరంగములు పాయలుపాయలగునట్లు జలక్రీడ సలిపిరఁట. శ్రీనాథుఁ డురోజపరిణాహము గలయువతులచే జలక్రీడ కుపక్రమింపఁ జేసి

దరఁగలను జర్జరితములను జేయించుపరిపాటి గలవాఁ డనుటకు భీమే శ్వరపురాణమునందలి యీక్రిందిసీసపాదము తార్కాణము.

ఒకచోటఁ బీఠాంబికోన్నత స్తనభరా
స్ఫాలజర్జరితకల్లోల యగుచు

భీమ 3

నలానదీతీరవాసినియైన పీఠాంబిక స్తనభరాస్ఫాలనమున నానదీతరంగములు జర్జరితములయ్యె నని యచటివర్ణ క్రమము. ఆక్రమమే యిచటను బాటింపఁబడినది.

ఉద్యానవర్ణనము:- ఇది రత్నపురవర్ణనమునం దంతర్భవించినది. పుర ప్రశస్తిని దెలుపుక్రమమున "ఆరామచూతపోతనికరసుకుమార కిసల యాస్వాద కషాయ కంఠకలకంఠ కామినీ కోమలకుహూకారకోలా హలాంకురితపంచమరాగరాజంబులును" అని యుద్యానవిభవమును సంక్షిప్తముచేసియున్నాఁడు.

మంత్రము:- యుద్ధారంభమునఁ గావించెడి యాలోచనమును మంత్ర మందురు. అట్టి దీప్రబంధమునఁ బ్రత్యక్షముగ లేదు. కాని లేకపో లేదు. బ్రహ్మవిష్ణువులయుద్ధ మురులింగావిర్భావమునకు నిదాన మైనది. ఆయుద్ధోపక్రమము బ్రహ్మదేవుని యహంకారపురస్కృత మైన మంత్రణమున జరిగినది. విరించి నిఖిలప్రపంచంబు నిర్మించి నిజాంతర్గతంబున నిట్లు మంత్రించుకొనెను.

ఉ. ఏ నధికుండ నాకుఁ బ్రతి యెవ్వరు నిర్జరకోటిలోన నేఁ
గాని జగత్ప్రపంచపరికల్పన సేయఁగ లేఁడు తక్కొరుం
డే నఖిలేశ్వరుండ నని యెవ్వరునుం బ్రతికోటి లేమిఁ దాఁ
దాన యహంకరించెను, పురాతసదాశివమాయ పెంపునన్.

శివ 1-70.

యట్టిహంకారపూరితమైన యాలోచనయే సహోదరజుల ఘోర యుద్ధమునకు మూలమైనది.

ఖ్యాతము:- దీనికిఁ బ్రత్యేకప్రసక్తి లేదుగాని ప్రకరణాంతరమున సూచితమైనది. సుకుమారుఁడు దుర్వ్యసనములకుఁ బాల్పడె నని తెలుపుచు దీని ప్రస్తావమును గొనివచ్చినాఁడు.

సీ. ద్యూతకేళియు వినోదోపాయ మయ్యెను
బరదారగమనంబు ప్రౌఢియయ్యె
నాత్మభార్యాపరిత్యాగంబు ధృతి యయ్యెఁ
జేలవిహారంబు సేమమయ్యె
గురుతిరస్కారంబు గరిమమయ్యెను నట
విటకీర్తనంబులు పటిమమయ్యెఁ
బానంబె యధ్యాత్మపరత యయ్యె సమస్త
తరలతాగతియ యుత్సాహమయ్యె
గుణములకు నెల్లదోషంబు గుణము నయ్యె
నపుడు సుకుమారునకుఁ దద్వయస్యులకును
నాదిగర్భేశ్వరత్వంబు యౌవనంబు
సవురు ధనమును జవవు హేతువులు గాఁగ

పురుషులకు యౌవనారంభమున సౌందర్యము ధనము సమీకూడిన నపమార్గమునఁ బడుట కవి సాధకములగును. అట్టివారికి జూదమాడుట వినోదోపాయము, పరదారగమనము నేర్పరితనము, ఆత్మభార్యాపరిత్యాగము ధైర్యము, గురుతిరస్కారము గొప్పతనము. విటులఁ గీర్తించుట పటుత్వము. మద్యపాన మధ్యాత్మపరత్వము, స్వేచ్ఛాచార ముత్సాహములుగను బరిణతమగుచుండుట. నిన్న మొన్నటి వఱకు నిది యిట్టిదియే.

నాయకాభ్యుదయము:- పతిత్వమునఁ బరాకాష్ఠ నందినసుకుమారుఁడలవోకగా శివరాత్రినాఁడు నాగేశ్వరాలయమునెదుట నిలిచి ఆ యర్ధరాత్రము వఱకు జాగరము చేయుటచేతను, పరమేశ్వరమూర్తిని మెండుకొనియున్న పూజాపుష్పముల దర్శనము చేతను, మహాదేవని

శాంతమారుతములు పొలుపారుటచేతను నిర్ధూత సకలకల్మషుఁడై తదాదిగా నతఁడు నీచవృత్తి నిడిచియుండిన కొంతకాలమునకు,

క. కుక్కలలో శబరులలోఁ
 గక్కురచిమ్మటులలోనఁ గార్కొటులలో
 బక్కణముగుడిసెనడుమను
 గుక్కపయిం జచ్చె నతఁడు ఘోరవ్యాధిన్

శ్రీనాథునిసంస్కృతపదసంకలితమైన విన్యాస మెంతటినాదరంభరితమై యుండునో, అచ్చతెలుఁగుపదములకూర్పులోఁ గూడ నట్టినాదసౌష్ఠవమును భావసంయోజనము నాయోజింపఁగలఁ డనుట కీపద్యమే తార్కాణము. ఈవిధముగ సుకుమారుఁడు వేఁటపల్లెలో గుడిసెనడుమ కుక్కలు ఎలుకులు చిమ్మటలు బలిసియున్నచోటఁ గుక్కపై జచ్చినను, యోగీశుఁడువలె నాతఁడు బ్రహ్మరంధ్రమునుండి ప్రాణములు విడిచెనఁట. ఆ విషయమును చిత్రించినతీరు పరికింతము.

సీ. క్రిమికంఠకుఠారమార్గమున కష్టము దొట్టి
 పెద్దయేనియు బాధ పెట్టకుండ
శ్లేష్మ ముద్రేకించి సెలవిరంధ్రము వాయు
 వెఱసి నిచ్చిల్లు గ్రమ్మింపకుండ
దృగ్గోళకంబులు దిరుగంగ దృష్టియు
 నంధకారంబులో నణఁగకుండ
నెఱి దప్పి యుచ్ఛ్వాసనిశ్వాసపవమాన
 పరివాహగతు లొట్టిపడక యుండఁ
బరమయోగీశ్వరుఁడువోలె బ్రహ్మరంధ్ర
వీధిఁ బ్రాణంబు విడిచె నవ్విప్రకులుఁడు
పుణ్యశివరాత్రి నలవోకవోలెనైన
సురగధరుచెంత జాగరం బుండెఁ గాన

పారదార్యము మద్యపానము మాంసాహారము చౌర్యము ద్యూతము అగమ్యాగమనము మున్నగు దుష్ప్రవృత్తులకు లోనయినవ్యక్తి చరమ

కాలమున ప్రాణములు విడువవలసివచ్చినపుడు, క్రిమి కంఠమార్గమున కడ్డముపడుట, శ్లేష్మోద్రేకమున సెలవులునిండి నుచ్చిళ్ళు గ్రమ్ముట గ్రుడ్లు తిరగఁబడుట, ఉచ్ఛ్వాస నిశ్వాసములు లేకుండుటయు జరుగుట సంభవము. అట్టిదేదియు లేకుండ విప్రకులసంజాతుఁడైన సుకుమారుఁడలౌకికగాన్నైన పుణ్యప్రదమైన శివరాత్రివేళ నాగేశ్వరునిచెంత జాగరముండిన కారణమున పరమయోగీశ్వరునివలె బ్రహ్మరంధ్ర మార్గమునఁ బ్రాణములు విడచుడ యాతని కబ్బిన పరమాభ్యుదయము. ఆసమ్మాలముననే యమదూతలు శివదూతలు కూడ నేతెంచి పరస్పరము సంఘర్షించుకొని, తుదికి యమదూతలపై శివదూతలు విజయము సాధించి సుకుమారుని కైలాసమునకుఁ గొనిపోవ నాతఁడు పరమేశ్వర కరుణాకటాక్ష పాత్రుఁడై దివ్యవిమానసహితమైన ప్రమథత్వము నందెనఁట. ఇట్లీకావ్యమును శ్రీనాథుఁడు ప్రతిజ్ఞానుసారముగ నష్టాదశవర్ణనా సమన్వితమును గావించుచు, ప్రకృతిసౌందర్యము నత్యద్భుతముగఁ జిత్రించిపెట్టినాఁడు. ఈ ప్రబంధమునందేవిషయమున నాతఁడు తన కవితాప్రసారమును సారింపఁదలపెట్టెనో యదు విలక్షణముగ సాగించినాఁడు. ప్రత్యేక విషయమునందు నౌచిత్యము సర్వథా పాటింపబడినది.

## కల్పనాచమత్కృతి.

కవి నిర్మించెడికావ్య మేదియగుననను నది భావనామయమైన నూతనసృష్టియే కావలయును. ఈశ్వరసృష్టి భౌతికపదార్థసంయోజనమున నేర్పడఁగా, కావ్యసృష్టి భావనాసమున్మిషిత పదార్థసంయోజనమున నేర్పడుచుండును. బ్రహ్మసృష్టిలో నంతకుముం దుండనిపదార్థజాతము క్రొత్తగ నావిర్భవించును. కావ్యసృష్టిలో నంతకు ముందు నిలిచియున్న పదార్థములకే క్రొత్తయాకృతు లేర్పడుచుండును. ఈ యాకృతులు భావనాపరికల్పితములు. ఈ కల్పనామయమైన సృష్టికి

నిదానము కవికిఁగల ప్రతిభ. ప్రతిభాసంపన్నుఁడైన కవి సృష్టిలోని వివిధ పదార్థములను విలక్షణ దృష్టితోఁ బరికించి, ప్రత్యేకముగ భావించి, దాను గాంచిన పదార్థమును క్రొత్తదానిగఁ జేసి శాబ్దిక జగత్తున రూపొందించును బ్రహ్మసృష్టిలోని స్థావరజంగమ పదార్థము లన్నియు, 'ధాతాయథాపూర్వమకల్పయత్' అను వేదోక్తి ప్రకారము వెనుకటివలెనే చూపట్టును. కావ్యజగత్తునందలి పదార్థములు నిత్యనూతనములు పరస్పరవిలక్షణములుగఁ జూపట్టును. బ్రహ్మసృష్టి లోని చేతనాచేతన వస్తువు లన్నియునిటఁ దాఱుమాఱగుచుండును. ఈ సృష్టి నవగతముచేసికొనఁజాలు భావుకున కడుగడుగునఁ జిత్తము నకుఁ జమత్కారము మొలతేరుచుండును.

భౌతికసృష్టిలో సౌందర్య సమన్వితములైన పదార్థములను గావ్యస్రష్ట నూత్నముగఁ గాన్పింపఁజేయునప్పు డంగీకరించిన క్రమ మునే 'కల్పన' యని వ్యవహరింతురు. ఈ క్రమము పూర్వాపూర్వము కంటె నుత్తరోత్తరము క్రొత్తగనే సాగుచుండును. ఇట్టికల్పనా సమ న్వితమైన నూత్నసృష్టికలదానినే నాఁడును గూడ నుత్తమకావ్య మని భావుకులు వ్యవహరింతురు. ఈ విధముగ క్రొత్తరూపముల నవతరించుచు వచ్చినకావ్యసృష్టిలోని కల్పనాచమత్కృతులనే అలం కార రస ధ్వని భావాదిమార్గములలో నాలంకారికులు కక్ష్యావిభాగ మును గావించియున్నారు. భావనామయమై శబ్దార్థ మయమైన నూత్నసృష్టి లేనినాఁ డది యుత్తమరచన యనిపించుకొనదు. కవికిఁ గలప్రతిభాసముత్కృష్టమున కీ కల్పనాచమత్కృతియే నికషోపలము రచన యనువాదరూపమయినను స్వతంత్ర మయినను, కల్పనాచమ త్కృతినిబట్టియే, దానికి కావ్యజగత్తున నిలుచుటయో నిలువకుం డుటయో తెల్లమగుచుండును.

శబ్దార్థాలంకారసంయోజనమునఁ గావ్యము జటిల మగుటయే గాని, దానిలో నాస్వాదయోగ్యమయిన భావసమృద్ధి యుండనేఱ దని యాధునికు లుద్ఘోషించుచున్నారు. ఇది యవిచారితరమణీయమైన ప్రసంగము. కవి తాను తనప్రతిభావిశేషమునఁ గ్రొత్తగఁ గాన్పింపఁజేయు సజీవనిర్జీవపదార్థములను, బాఠకులయెదుట సాక్షాత్కరింపఁజేయుట కీయలంకార నిబంధన ముత్తమసాధనము. అలంకారము లనునవి కావ్యమున కుపస్కారములే గాని, యపకర్షకము లుకా వనునది సహృదయవేద్యమయిన సత్యము. ప్రాచీనకావ్యసృష్టి యందలి రచనాచమత్కారము నవగతముచేసికొనఁజాలిన విశేషాధ్యయనము ప్రణిధానము లేనివా రనుకొనుమాట యది గాని, యథార్థ మెన్నఁటికిఁ గానేరదు. శ్రీనాథుఁ డీశివరాత్రిమాహాత్మ్యప్రబంధమునం దాయోజించిన కల్పనాచమత్కృతి యెట్టు లాగెనో కొంత పరికింతము. ఈప్రబంధ మీశానసంహిత కనువాదరూపముగ నవతరించినను స్వతంత్రరచనమే యనఁజాలియున్నది. ఈ రచనలో నాతనిభావనామయమైన సృష్టి యనల్పముగఁ గూడియున్నది.

హేమాంగదుఁ డను వింధ్యాచలదుర్గాధిపతి నివాసమైన రత్నపురీవర్ణనప్రస్తావములో పురోపవనదీర్ఘికల నీవిధముగఁ జిత్రించినాఁడు.

మ. పరలోకస్థుఁ బతిన్ ఝషాంకు బ్రతికింపఁ గోరి యాకాంరశం
కరుమ్రోలన్ రతి మూర్ఛకంఠముగ నాక్రందించె నా నొప్పు న
ప్పురబాహ్యోపవనాంతదీర్ఘికల (లోఁ బొల్పార) నోలాడు పు
ష్కరకింజల్కభుజిక్రియాసుఖితహంసక్రేంక్రియారావముల్. శివ. 2.8

రత్నపురము వెలుపల నుండెడియుద్యానవనముల దిగుడుబావులలో నోలాడుచుండెడి హంసలు నచటి పద్మకింజల్కములు భుజించుచు నానందముతో క్రేంకారములు సేయుచున్నవి. ఆ క్రేంకారములు, రతీదేవి హరనేత్రాగ్నికీలావ్యాప్తిచేఁ బరలోకగతుఁడైన తనపతియగు

మన్మథుని తిరిగి బ్రతికింపు మని, అచట నివసించియున్న ఓంకార శంకరునిముందర గొంతెత్తి మొఱవెట్టుచుండెనో, యనునట్లుండె నఁట. ఇది కల్పనాసమన్వితమైన యూహ. దిగుడుబావులలోఁ దిరుగుహంసలు క్రేంకారములుసేయుట సహజము. అవి రతీదేవి, భర్తృపునరుజ్జీవనమునకై కావించెడి యాక్రందనములో యనునట్లు త్ప్రేక్షించుటలో రతీకంఠనాదమాధుర్యము వానికిఁ గల దనుట సూచితమైనది. ఇదియును రతిచే నాయాక్రందన మోంకారశంకరు ముందరఁ గావింపఁజేయుటలో శ్రీనాథుని యాశ్వాసార్చనకళాశీలత్వము ప్రస్ఫుటమైనది. ఏపాటియవకాశము లభించినను, ఏవిషయమునైనను బరమేశ్వరానుషక్తము గావించుశీల మాతని కలువడియున్నది; గావుననే, రత్యాక్రందనము నోంకారశంకరుని ముందరఁ గావింపఁజేసి యున్నాఁడు.

ఇటులనే పురికెలంకులయందలి కొలంకులు వర్ణించుటయందును గూడ నొకకల్పనాచమత్కృతిని గావించి యున్నాఁడు. పరికింతము.

ఉ. లక్షలసంఖ్య లప్పురికెలంకులయందుఁ గొలంకు లొప్పు వా:
పక్షిగరుచ్ఛటాపవన పాతవికంపిత పంకజంబులై
వీక్షణకౌతుకంబు ప్రసరించుచునుండును లీలమై సహ
స్రాక్షుఁడు విశ్వరూపమహిమాద్భుతమున్ బ్రకటించెనో యనన్. శివ.2.11

ఆ పట్టణపరిసరములలో అసంఖ్యాకములైన సరస్సులు, జలపక్షులు, ఱెక్కలాడింపఁగఁ గదలాడుకమలములు గలవై యొప్పుచు, విష్ణువు విలాసగ విశ్వరూపమహిమాద్భుతమును బ్రకటించెనో యనునట్లు చూడముచ్చటగొలుపుచుండునఁట. ఇచట సహస్రాక్షుఁ డనఁగా పురుషసూక్తమున 'సహస్రాక్షస్సహస్రపాత్' అని నిరూపితుడైన సర్వవ్యాపకుఁడైన పరమేశ్వరుఁడే గాని దేవేంద్రుఁడు గాఁడు. విశ్వ

రూపమహిమాద్భుతమును ప్రకటించినవాఁడు విష్ణువే యగుటచేతను. ఆతఁడు పద్మనయనుఁ డగుటచేతను తదర్థమే యిచట గ్రహింపవలయు ననుట. విష్ణునినేత్రములయినపుడే యవి జలపక్షుల తెక్కలల్లార్పఁగా రేఁగినగాలిచేఁ గదలాడుపద్మముల పోలిక దాల్పఁగల్గును. అనిమిషేంద్రునినేత్రము లయినచో వానికిఁ గదలాడుకమలములతోఁ బోలిక సరిపడదు. విష్ణువు విశ్వరూపమహిమను ప్రకటించుట యేదియో యొక కారణమును బట్టి జరుగుచుండినట్లైతిహ్యము. ఇచట నది హేలాప్రదర్శనముగా నూహించుటలో నొకచమత్కార మేర్పడినది. చలత్పక్ష్మషండమండితమైన తటాకములను విశ్వరూపమహిమాప్రదర్శనప్రసక్తుఁడైన పరమేశ్వరుని విలాసముగా నుత్ప్రేక్షించుటలో నీశ్వరాగార్పసకలాశీలత్వము మఱింతగాఁ బ్రస్ఫుటమయినది. ఇప్పుడు కేవలము సరోవరవర్ణనముకాక పద్భుతావహమే యయినది.

యజ్ఞదత్తామాత్యుని దేవి సుశీల గర్భవతియైనపుడు గృహ్యోక్తవిధిని సీమంతపుంసవనములు జరిపించినప్రకరణమిది. బ్రాహ్మయాసనమునఁ గూర్చుండి జయాదిహోమములు నెఱపించినప్పుడాయాజ్యహోమధూమములవ్యాప్తిని కవి యిట్లుత్ప్రేక్షించియున్నాఁడు.

మ. చెవికిం గలితతంసకోత్పలదళశ్రీయై కపోలంబులన్
నవకాలాగరుపత్త్రరేఖలయి మేనం గమ్మకస్తూరియై
ధవళాంభోరుహనేత్రపైఁ మెఱసె నుద్యల్లీల సీమంతపుం
సవనాజ్యాహుతి హోమ సంప్రభవ చంచద్వహ్ని ధూమచ్ఛటల్.

శివ. 2-58.

సీమంతము పుంసవనము అనునవి రెండును భార్య గర్భవతియైనపుడు గర్భస్థశిశువున కభ్యుదయ మేర్పడుటకు, పురుషసంతానము గాంచుటకు నెఱపెడి స్మార్తసంస్కారము. దీనికై హోమములు చేయుద

పుడు అగ్నిహోత్రమునుండి చెలరేగిన ధూమములు సుశీల శరీర మంతటను వ్యాపింపఁగా చెవికి విలాసముగఁ దాల్చిన నీలోత్పలదళ కాంతులై, చెక్కిళ్ళకు కృష్ణాగరుపత్త్రరచనా రేఖలై, ఒడలంతటికి కస్తూరి పూఁతయై మెఱసెనఁట. మంత్రపూతమైన హోమధూమ ప్రసారము శరీరమున పవిత్రత నాపాదించుటయేగాక, యలంకార విభవమునుగూడ వహించె నని కవి యుల్లేఖించిపెట్టినాఁడు.

ఇటులనే నవప్రసూతుఁడయిన సుకుమారుఁడు పొత్తులలోఁ బరుండియుండిన విధము ని ట్లుపమింపఁజేసినాఁడు

గీ. బాలకుఁడు చంద్ర చంద్రికా పాండురయిన
పాన్పుఁ బొత్తులపై నొప్పఁ బవ్వళించి
యమృతవారాశిలోన శేషాహిమీఁదఁ
బవ్వళించిన కౌస్తుభాభరణుఁ బోలి. 2.73

నవోదితుఁడయిన సుకుమారబాలుఁడు, వెన్నెలవలెఁ దెల్లనయిన పొత్తులపైఁ బవ్వళించినతీరు క్షీరసముద్రములో శేషాహిమీఁదఁ బవ్వళించియున్న శ్రీమహావిష్ణువును బోలియుండెనఁట. క్షీరవారాసిలో శేషతల్పమునఁ జిన్నిబాలుఁడై పవ్వళించిన శ్రీమహావిష్ణువుతో సుకుమారుని బోల్చుటలోఁ గల్పనయెంతయు నుదాత్తమై యొప్పలారినది. పొత్తులనఁగాఁ బుట్టినశిశువులను బరుండఁబెట్టుటకై వేసెడి సన్ననిగుడ్డలు. ఇచటఁ దెల్లనయినపాన్పు, దానిపైఁ దెల్లనిపొత్తులు గూడియుండుటచే క్షీరసముద్రమునందలి శేషాహితోఁ బోల్పఁ బడినది.

సుకుమారుఁడు శివరాత్రినాఁటిరాత్రి సలవోకగా నాగేశ్వ రాలయసన్నిధికిఁ జేరినప్పటి యాతనిమద్యపానాసక్తమైన స్థితిని నిరూపించు ప్రకరణ మిది.

గీ. పవనచలితమునఁ గేతకీ ప్రసవ ధూళి
యంగమున బ్రత్తి యుండంగ నాతఁ డపుడు

విమలభస్మ సముద్ధూళన మొనరించి
పాశుపతదీక్ష గైకొన్న భంగి నుండె. 4-41

పతితత్వమునఁ బరమసీమ కేఁగినసుకుమారుఁడు, హాలాపాన మదాతిరేకమున నాగేశ్వరాలయమునెదుట నిలిచి, యానాగేశ్వర లింగమును మెండుకొనియున్న పుండరీకపూజఁ గాంచి, యున్నసమయమున వాయువశమున మొగలిపూవులపరాగ మాతనియొడల నంటెను. దానితో నాతఁడు తెల్లనైనభస్మ మొడలినిండఁ బూసికొని పాశుపతదీక్ష గైకొన్నవిధముగ నుండెనఁట. ఈకల్పన మీాప్రకరణమున కెంతయు సరిపడియున్నది. అలవోకగా నీశ్వరపూజాదర్శనము జతగూడినట్టులే యాకస్మికముగ కేతకీపరాగధూళిచే పాశుపతప్రదీక్ష గైకొనినట్లయినది. ఇటులనే యాయాలయమున తొలుజాము పూజకై మ్రోగింపఁజేసిన పటహారవముచే నాతని సకలపాతకములు తూలఁబాఱె నని చిత్రించినాఁడు.

చ. కలఁగఁగఁబాఱె నాతనియఘంబులు పంచమహాఘసంభవం
బులు బహుకాలసంకలితము ల్దవవహ్ని చిటచ్ఛిటధ్వనిం
గలఁగఁగఁబాఱు పక్షుల ప్రకారమునం దొలుజాము పూజకై
బలుపటహమ్ము తమ్మనుచు భర్గుని గేహమునందు మ్రోసినన్. 4-42

నాగేశ్వరాలయమున పటహము తమ్మని మ్రోగినంతనే చిరకాలమునుండి కూర్చుకొనిన సుకుమారుని పంచేంద్రియసంభూతములైన పాపములన్నియు కలఁగఁబాఱెనఁట. దావాగ్ని చిటచిటమనిధ్వని చేయుచు నెగయునపుడు యరణ్యమధ్యమునఁ జిరకాలమునుండి యొకచోఁ గూడియున్నపక్షు లెట్టులు కలఁతచెంది పాఱిపోవునో, యట్లు పరుగెత్తిపోయె ననుటలో నీయుపమితిసామగ్రి సుకుమారునిపాపములు పాఱఁదోలుట కెంతయు సహకరించె నని తెలియుచున్నది. ఇందలిసామ్యము మిక్కిలి చమత్కారజనకమైనది.

## ఉ ప సం హా ర ము

ఇంతవఱకుఁ బాఠకలోకమునకు లభించిన శ్రీనాథునికృతులలోఁ శివరాత్రిమాహాత్మ్యమే యాతని తుదిరచనగాఁ గానవచ్చును. ఇది తుదిరచనయగుటను గాఁబోలు దీనిలో భావములు భాష శైలి కల్పనాచమత్కృతి మున్నగు కావ్యసామగ్రియంతయు బహుపరిణతమై ప్రసరించినది. ఉత్తమభావుకున కీప్రబంధము బహ్వాస్వాదయోగ్యముగా నున్నది. ఏపట్టునందైనను ఔచిత్యమునకు భంగ మేపాటియుఁ గానరాదు. దీనిలోని తెలుఁగునుడికారపుసొగసు కడులలితమై కొనలుసాగినది. ఇది శ్రీనాథుని స్వతంత్రరచన యనుటకు సర్వథా తగియున్నది. అంతవఱకుఁ బెక్కుప్రబంధములు రచించి బాగుగ పన్నులు తేఱినచేతితోఁ బరమేశ్వరార్పణరూపముగ దీనిని వెలయించి యున్నాఁడు. కావుననే యిందలిప్రతివస్తువు నుదాత్తముగ గోచరించును. కృతిభర్త శ్రీశైలవాసి శాంతభిక్షావృత్తియతీశ్వరుని మూలభృత్యుఁడై మమ్మయశాంతయ్య యగుటచే నిందు శైవాగమసంప్రదాయానుగతమైన రచన భక్తిభావసమన్వితముగఁ గొంత కొనసాగినను, శ్రీనాథుఁడు తనకృతులన్నిటిలోను సహజముగ నెఱఁగించు నైతికాచారవిషయములు పాత్రోచితక్రమమున వెలయుచునే వచ్చినవి.

ఈప్రబంధమున నిర్వహింపఁబడిన ప్రధానరసము శాంతము. అది [illegible]శృంగారభావములచేఁ బరిపుష్టమయినది. శాంతమునకు స్థాయి నిర్వేదము. దాని కుపష్టంభకముగ శృంగారమును జతగూర్చినాఁడు. ప్రధానముగఁ బరమేశ్వరభక్తిభావావిష్కృతి కుపాత్తమయిన యీకావ్యమునఁ జండాలీబ్రాహ్మణ బ్రివసంయోగ శృంగారమును వర్ణించుట యపకర్షాధాయక మని కొందఱ యాశయము. దీనిలోఁ బ్రధానముగ నిర్వహింపఁ బడినరసము శాంతము.

గాని శృంగారము గాదు. ప్రధానరసము శృంగారమై యది యనుత్తమప్రకృతి సమాశ్రయమైనప్పుడే దోషాపాదక మగును. ఈప్రబంధమునం దట్టిదోషము నుద్భావించుట కవకాశము లేనేలేదు. నిదానముగఁ బరికించిన నీప్రబంధమునందలి చండాలిపాత్రలోఁ గానవచ్చెడి యుదాత్తాశయము లుత్తమవంశసంజాతలయిన యేనాయికలయందును గానరావు. సుకుమారుఁడు పతితత్వమునఁ బరాకాష్ఠనందినప్పుడు గాని, యాతనికుత్తమస్థితి నందుటకుఁ దగినని ర్వేదము లభింపదు. కావున నాతనిఁ బతితుని గావించుటకే తదాశ్రయముగ శృంగారము వర్ణింపవలసివచ్చినది.

ఇఁక నీప్రబంధమునం దేవిషయమును వర్ణింపఁ దలపెట్టినను బహుసంయతముగను విలక్షణముగను సాగింపఁజేసినాఁడు. భావము లన్నియు పరమసుకుమారములును ఔచితీసమన్వితములునై వెలసినవి. భట్టబాణుని కాదంబరీరచన దీనిలోఁ గొంతవిశేషముగఁ దోఁచఁ బడినను, పెక్కుతావులందు స్వకపోలకల్పితములైన విన్యాసములే గానవచ్చును. మఱియొకప్రతి గానవచ్చి యిందలి గ్రంథపాతము లన్నియుఁ బూరితములై, ఈప్రబంధము సుపరిష్కృతమై వెలువడినచో శ్రీనాథుని యితరరచనలకంటె నిది యత్యుత్తమమైన రచన యనిపించుట తథ్యము. ఈగ్రంథము వెలువడినవెంటనే దీనిపై విపరీతవిమర్శనములు బయలువెడలుటచే, ఆంధ్రసారస్వతపాఠకులు, శ్రీనాథుని యితరకృతులవలె దీనిని బఠించుటలేదు. ముద్రణము నందందదుకులు గూడుట దానికి మూలము. పరిమితసంఖ్యాకములయిన గద్యపద్యము లుండుట మఱియొక కారణము. శ్రీనాథుని యెడఁ జాలమందిహృదయములలో సద్భావము లేకుండుట వేఱొక కారణము. ప్రాచీనకవికృతుల నవధానముతోఁ జూచెడి పరిపాటి సడలుట యింకొక కారణము.

కావున నాంధ్రసారస్వతపాఠకుల కొక మనవి. నా యోపిన కొలఁది నీప్రబంధమునందలి యుత్తమత్వమును తెల్లముచేయుటకు యత్నించి కొంతవట్టు వ్రాసితిని. సహృదయులయిన పాఠకులు శ్రీనాథునియెడ సద్భావము నలవరించుకొని, యీ ప్రబంధము నవధానముతోఁ బఠించి, యుత్తమభావసంగ్రహతత్పరులయినచో, నా యీ కృషి, పరిషదాశయమును సఫలము కాఁగల దని నా యూహ. శ్రీనాథునికృతు లన్నిటిమీఁద నామానస ముద్బోధించిన విధమున సమగ్రమైన విమర్శనము గావింపవలయునని నా సంకల్పము. ఈవఱకుఁ గొన్ని విషయముల నీ పత్రికాముఖముననే వెలువఱిచియుంటిని. ఈ విషయముల నన్నిటిని ప్రత్యేకగ్రంథములుగఁ బ్రకటింప సంకల్పము. నారచనలలో గుణాలప మేదేనియున్న సహృదయులు సౌహార్దముతోఁ బరిగ్రహించెదరుగాత మని నా వేఁడికోలు.

ఓమ్ శమ్.

క. పృథుల ప్రణయంబున మ
న్మథుఁ డయ్యరదంబు నడప మాధవుఁ బనిచెన్
రథి యుల్లసిల్ల నట సా
రథియగుచుం దనరె సురుచిరంబుగ నతఁడున్.

వ. తదనంతరంబ యనన్యసామాన్యంబులగు నిజసైన్యంబులు తోడఁగూడ దుర్వారప్రకారంబున,

సీ. రాజమరాళ విభ్రాజమానాయత
పక్షసముత్కటపటహరవము
కోకిలసైనిక వ్యాకీర్ణతరసము
త్కరకూజనాహ్వాయ తార రవము
శారికాదారికాసారనానాశ్రమ
భాషణవిజయాంకపఠనరవము
రోలంబమాగధప్రోన్మధఝుణఝుణ
త్కారమనోహరగానరవము
నొక్కమొగి దిక్కులన్నిటఁ బిక్కటిలుచు
నాత్మ కలనిర్భరానంద మావహింప
బలసి ఖచరుల కన్నులపండు వగుచు
హరునిమీఁదికి దాడిగా నరిగె మరుఁడు.

క. సరసరసపుష్పపల్లవ, భరనతశాఖానవీనపాదపమును నం
తరఘనసాకారము నగు, తెరువతనికిఁజూపెఁగమ్మ తెమ్మెరలంతన్.

వ. ఇట్లు సకలసన్నాహంబునుం బ్రకటసముత్సాహంబును నెసక మెసఁగ నానాశ్చర్యవంతంబగు నీశ్వరాశ్రమంబు నారసి, యొక్కమనోజ్ఞస్థలంబున విడిసి, కంతుం డపుడు వసంతుతోడ సస్మదాగమనాను రూపంబుగా భవదాటోపంబు నెఱపు మివ్వనంబునకు జవ్వనంబార నని పనిచినఁ దదనంతరంబ.

మ. ధరణిం దోఁచె సమోష్ణశీతములు మాద్యత్ప్రావసంఘాతముల్
సరవి ప్రోల్లసదంతరాళములు హృత్సంహ్లాదనావేశముల్
విరళ ద్రోగరిమప్రసారములు సావిర్భావశృంగారముల్
వరపాథోదరవాపిగాహములు తత్త్వానంతసన్నాహముల్.

చ. పరువడి దేహధారులకుఁ బశ్చిమమార్గశరత్వఘాతవి
స్ఫురణలఁ గర్మబంధములు భోరనఁ బెల్లుగఁ బాయులాగునన్
దరమిడి యెల్లశాఖలకు దక్షిణమార్గసరత్సమీరణో
త్కరముల జీర్ణపత్త్రములు తద్దయుఁ బెల్లుగఁ బాసె నత్తఱిన్.

చ. ఒలయు నిశేశసంగతుల నుత్కలికోత్కటగాత్రవిభ్రమం
బులు కడు నంద మొందె తమి బోంట్లును నొప్పు వహించినట్టి చె
య్వులు నవమాధవాగతుల నుత్కలికోత్కటవృక్షవిభ్రమం
బులు తమకంద మొంద వనభూములసొంపువహించె నంతయున్.

చ. సకలవనాంతరంబులను సాంద్రతరంబుగ నొప్పెఁ బల్లవ
ప్రకరములుం బ్రసూననికరంబులు నగ్నిమణిప్రతాన సా
త్త్వికములు జంద్రరత్నవసతీతిలకంబులు నై లతాంతసా
యకునిప్రతాపమయ్యశమునారయమూర్తులు గన్నచాడ్పునన్

చ. మనములరంగ నొక్కమొగి మామిడిలేఁజిగురాకు లాదటన్
గొనకొని మేయుచుం గసరుఁగుత్తుక నొందక తిన్నగాఁగ మో
హనకలనంబునం బికచయంబులు గూయఁగఁ జొచ్చె వాలుగ
బ్బునఁగుసుమాస్త్రుఁ డుబ్బి వడి నార్వఁగఁ జొచ్చె సుపర్వ్వ
లోయనన్.

ఉ. దాంట్లును గట్టి క్రొవ్విరుల తావులు గ్రోలుచు నొప్పె నంతటం
దేంట్లును భోగకాల మిది తెల్లము దంపతులార ప్రేమముల్
మాంట్లును సేయలే దనుచు మాధవుఁ డింపునఁ జాట్రమోయునా
తేంట్లును బోలెఁ బూర్ణసముదీర్ణఘుణంకృతిమందిరంబులై.

మ. చలగుచ్ఛస్తనము ల్ప్రొవనర్ప మధురస్యందన్మరందశ్రీమాం
బులవంబు ల్గనుపట్టఁ బల్లవులు రాఁ బూర్వాంగహారంబు లి
మ్ముల సేర్ప న్మధుసూత్రధారకరణంబు ల్దప్పకుండన్ లతా
లలనల్ చూపిరిమందవాయుగతులన్ లాస్యంబు శస్యంబుగాన్.

క. మనసిజుఁడుహారజయార్థముకనకపుఁగేళాలుమించుగావించినచొ
ప్పున మెఱసెఁబీతరుచినూతనవర్ణితకర్ణికార తరుకుసుమంబుల్.

వ. ఇట్లు కాలని ర్వేలయగు వసంతవేళ గని శివతపోవనాశ్రయులగు
సంయములు వికారాశ్రయంబులగు చిత్తంబులందు నెట్టకేలకు నెట్టనఁ
దాల్మికల్మి నిలువంబట్టి రట్టిసమయంబునఁ గాసారంబుల తీరంబుల
తొలఁగి పేలవమృణాలకాండంబులు ఖండంబులుగాఁ దునిమి కొంత
కొంత నమలి రుచివిశేషంబులం దనరు తచ్ఛేషంబులు ప్రణయవతు
లగు సతుల కొసఁగుచు నెసంగుకలహంసంబులును, నీలజలదజాలంబుల
నెనయు తమాలంబుల కేళ్రీవం గేవలంబు క్రొవ్వగల పొగపువ్వులనం
జొరునం గారుమకరందంబులు వానచందంబున మెఱయం దత్సమీ
పంబున నిలిచి సారకేకారవమాధుర్యలగు భార్యలశిఖండంబులు తుం
డంబుగొని విప్పుచు నొప్పు నీలకంఠంబులును, మాకందంబులవదికి
నానందంబునం గదిసి యలగొమ్మల నిమ్ముల నిండి, కుదరంబండి
భవ్యవర్ణవ్యతికరంబునం బొలుచు ఫలంబుల రసంబు లప్పసంబుగాఁ
గమిచి చతురక్రియావిధేయులగు జానియల కిచ్చుచు మెచ్చురాజ
కీరంబులును, నాదిగా నిట్లు వివిధ దంపతులు సముద్దామకామసంపద
లగుటం జూచి మనంబు లేచి ఘనంబుగా ప్రబ్బుకొనునుబ్బునం బ్రమ
థులు గీతాగతాప్సరప్రమదలతోడం జెరలాడం దొణంగి రిబ్భంగిం
దదవసరం బతిమనోహరంబుగా నుండఁగా.

సీ. ముందఱ నందంద క్రిందంగఁబడకుండ
ముఖరబంభరముల మొనలుదీర్చి
దండగోలుగ నుండి తత్సమీపంబున
వదరుపికంబుల వరుసఁ గూర్చి

పిఱిందికి నెల్లను బిరుసుంగావలి గాంగం
గ్రమముగ రాజహంసముల నునిచి
కెళవుల వెంటను బలువుగాం జిలుకల
శారికలను జను దేరం బనిచి
యేరజాతికి వాలయ సమీరణములు
బన్చి సఖులకు సైన్యాధిపత్య మిచ్చి
నడుమ రతియును దానును నడంక నిలిచి
కదలె వలరాజు హరుతోడికదనమునకు

ఆ. మదనుం డివ్విధమునం గదలి శంకరతప
స్థ్సలము చేర నరిగి తనదుబలము
నచట నచట నునిచి యంతయు వే దించి
యెలమిం దాను నొక్కకెలన నిలిచి.

సీ. ఉత్తాన పదపద్మయుగశోణరుచిపద్మ
పర్యంకబంధనిష్కంపగాత్రు
నుత్తుంగనాసాగ్రయుక్తనిశ్చలజాగ్ర
దీపత్ప్రకారసమిద్ధనేత్రు
చంద్రభాస్కరమార్గ సంచరణానర్గ
ళానిలరోధసిద్ధాంతరంగు
బహిరంతరాపూర్ణ పరమధామోదీర్ణ
నవ్యాత్మ దర్శనానందసంగు
నదమలవ్యాఘ్ర చర్మసంఛన్న దేవ
దారువద్వేదికోపరిస్థలనిషణ్ణు
విపులవేదాంతసిద్ధాంత విహృతిదక్షు
ఘనసమాధిస్థు ఫాలాక్షుం గనియె మరుండు.

వ. ఇట్లు దుస్సహాపభ్రాధురంధరంబును నిర్నిద్రనిచ్ఛిద్ర నిరర్గళ పరబ్రహ్మానుభవత్సరంబును నగు ననూనజ్ఞానచిన్మయ స్వరూపంబుచేత వితాంతనిష్కంపప్రదీపంబులీల మెఱయుచున్న యనశ్వరు నీశ్వరుం

గని, యతని యుల్లంబు గానను, లక్ష్యంబుగాఁ బూనను నేరక, యూరక విషమశిఖుం డనంతచింతాకులమ్ముఖుం డగుచు నుండుసమయంబున.

సీ. కటిభారమునఁ జిత్రకాంచీగుణంబుగా
మంజులవకుళదామము ఘటించి
కంఠదేశమున ముక్తాకలాపంబుగాఁ
దతసింధువారజాతము రచించి
మణిబంధముల రత్నమయకంకణములుగా
బంధపలాశపుష్పము లమర్చి
కర్ణయుగ్మముల సత్కనకపత్త్రములుగా
నవకర్ణికారసూనము లొనర్చి
మఱియు నానావయవములు మెఱయు భూష
ణములు గాఁగను తత్ప్రసవములు దాల్చి
మదనుఁ డాయగజాత దీమముగ హరుని
నేయ సమకట్టి లోన నెయ్యినకడిమిని.

చ. చెలఁగుచు నమ్మరుం డలరుసింగిణి యెక్కిడి తేఁటినారి బి
ట్టొలయ రవంబొనర్చి వెస నున్మదనాస్త్రము సంఘటించి దో
ర్బలము దలిర్ప నిండఁ దెగవాడి పినాకితలంపుదూర ని
శ్చలగతి నేసెనాత్మభటసంఘములన్నియునుబ్బి యార్వఁగాన్.

చ. అలవడ నక్షణంబ హరునంగమునం గలయంగ నంతటన్
బులకలు దోఁచె నొక్కట నపూర్వవిధాగతి వచ్చి నాఁటి లో
పలన మనోజుతూపు బహుభంగులమూర్తులుదాల్చియన్నివం
కల వెస వెల్వడం దలఁచి గాటముగాఁ దలచూపురూపునన్.

చ. హరుఁడును దాల్మి కొంత మడియ న్వరబింబఫలోపమోజ్జ్వలా
ధరమగు పార్వతీవదనతామరసంబున యందు నిల్పె ని
ర్భరహృదయస్థ రాగరసభావకళాప్రకటీకృతిక్రమా
దరవికచాయమానగుణవామవిలోలవిలోచనంబులన్.

ఆ. అపుడు వింతలజ్జ నగజ సాచీకృత
వదనకమల యగుచు హృదయకలిత
రతివిశేషలీల ప్రకటించె సరసత
మంగళపరిసంగతాంగకముల

వ. తదనంతరంబ నిటలాక్షుండు వశిత్వదక్షుండు గావునఁ జిత్తవి కారంబు బలాత్కారంబున నిగ్రహించి, తమఃపరిణాశంబున కాగ్రహించి, తత్కారణం బారయ నిరువంకలఁ జూపులు దనర్చి యొక్క భాగంబున.

సీ. అరజంగతోడ నొయ్యారంబు గరము చొ
ప్పడ నలవఱిచిన పాదయుగము
నాదట నొక్కొంత నాయతశిఖరంబు
లగుచుండ నెఱసిన యంసయుగము
కర్ణాంతముగ లస్తకసఖంబున గాఢ
ముగఁ గీలుకొలిపిన ముష్టియుగము
నేకంబెకా ఘటియిల్ల లక్ష్యమునంద
ధృతలీల నిల్పిన దృష్టియుగము
భూరివిస్మయ విభ్రమాకారిగరిమఁ
దనరి తనమేటి విలుకాని తనము దెలుప
భాసిమోహనాస్త్రము వింటఁ బోసి తిగిచి
మఱియుఁ దను నేయుటకుఁ జూచుమరునిఁ గనియె.

మ. కనిభ్రూభంగభయంకరంబగుచువక్త్రింబొప్పరుద్రుండు హా
మ్మని ఫాలస్థలనేత్రముం దెఱచె రోషావేశదుష్ప్రేక్షుఁడై
జనియించెం దదనంతరంబ దశదిక్సంపూర్ణశుంభన్మహా
ధ్వనిమత్సంక్షయసంభవద్దహనదుర్వారానలజ్వాలముల్.

ఆ. అపుడు కోపమణఁపు మణఁపుము కృపఁ జూడు
చూడు మీశ యనుచు సురలు మింటఁ
దగిలి మొఱ యిడంగఁ దత్పావకార్చులు
మొనసి మదనుఁ జుట్టుముట్టుకొనియె.

చ. వలపుల తేరుఁ జారుశుకవాజులు పువ్వులవిల్లుఁ జొక్కుటు
మ్ములు మకరోన్నతధ్వజము మున్నుగ నంతన శంభుఫాలదృ
గ్జ్వలనవినిర్గతానలశిఖాతతు లంగజు నేర్చి భస్మసా
త్కలన మొనర్చి యద్భుతముగాఁగ ననంగునిఁ జేసె నాతనిన్.

వ. ఇట్లుఖర్వగర్వధురీణుండగు విషమబాణుం జిట్టమిడిచినంతవడి నెట్టన పొడవడంచి మించినయాగ్రహం బుడుగనేరక ధవళప్రభాలసితంబగు తద్గాత్రచితాభసితంబు పరుషమతి నిజదేహంబునకనుపమలేపంబు గావించి తాపంబు చాలించి యాహూఢవృషభుండును నాహూతప్రమథుండు నగుచు మదనసంహారుండు కైలాసంబునకు విజయంచేసె; నట హైమవతియును విరళకామవతి యగుచు జనకునానతి సఖులు గొనిపోవ నెట్టకేలకు నిజావాసంబున కేఁగె నంత నిక్కడ.

క. హరుకంటఁ బొడమమంటలు
మరునంటఁగఁ దరుమునపుడు మదిలోన భయా
తురయగుచు దుఃఖ మొదవఁగ
ధర వివశతఁ బడ్డరతి పదంపడిఁ దెలిసెన్.

ఆ. తెలిసి ప్రాణనాథ కలవె ప్రాణంబున
ననుచు లేచి కలయఁ గనుచు వెఱచి
భావజాతుతనుని భస్మంబు ముందటఁ
గనియెఁ గాని మరుని గానదయ్యె.

ఉ. కానక మూర్ఛ నవ్వనిత క్రమ్మఱ భూమిని వ్రాలితీవ్రశో
కానలదహ్యమానమగు నంగమునర్కిణ కాలమట్లు ని
ర్మానసమాడ్కి నుండి యొకమానముగా నటు తేరి వేచి తా
వ్రేసిన వెంట వ్రేలఁ గడువిహ్వలతన్మరుఁ జేరఁగుర్చుచున్.

ఆ. ఉలికి గదియ నరిగి యురము కరంబులఁ
గరము మోదికొనిన యరుణిమంబు
దోఁచె హృదయకలితదుఃఖాగ్ని లోపల
నిండి వెలికి నుబ్బి నిగుడినట్లు.

వ. మఱియుఁ బలుతెరంగుల నసహ్యంబగు నవవైధవ్యంబునకోపక పొరలి పొరలి లేచి యాత్మం బతి ననుగమింపఁ గృతనిశ్చయురాలగుటయు నాకాశసరస్వతి మదనపునర్జన్మసూచకంబులగు భాషణంబులు వలికి, తత్ప్రారంభం బుడిపిన, రతియును నొక్కయెడ నిల్చి తపంబు సేయుచుండె.

క. కందర్పదహనమనఁగాఁ బొందగునీశంభులీలబుధనుత నియమా
స్పందతఁజదివినవిననునందుదురహరహామభీప్సితార్థఫలంబుల్.

వ. అని చెప్పి వెండియు,

శా. కాంతాకాంతకటాక్షవీక్షణా విభాకల్యాణకల్యాంగ దు
ర్దాంతాశాంత మహాప తాప దహనాక్రాంతా ద్విషద్వీరయ
శ్రాంతత్యాగ కృతాకృతార్థిజనసార్థా సార్థలజ్జాప్రదా
నంతా శ్రీప్రకటప్రయోగసమరవ్యాపారపారంగతా!

క. ధాటీనటత్సముద్భట ఘోటిఖరఖురట్టరట్ట కుంఠనరభసో
త్పాటితధరణీతల విస్ఫోటితనూతన పరాగచుళికిత ధరణీ।

పంచచామరము :-

జగత్ప్రసిద్ధ విక్రమా! యశస్సముజ్జ్వలక్రమా!
యగణ్యపుణ్యకీర్తనా! దయాలసత్ప్రవర్తనా!
ఖగప్రభుస్ఫుటత్పరాయఖ సర్వశత్రుజిత్పరా
నృగక్షమేశలక్షణా! వినీతరాజలక్షణా!

గద్య:—ఇది శ్రీమదష్టభాషాకవితా ప్రవీణ వినయధురీణవిబుధజనస్తుత్య నిశ్శంకకొమ్మనామాత్య ప్రణీతంబైన శివలీలా విలాసంబునందుఁ దృతీయాశ్వాసము.

శివార్పణమస్తు.

శుభమస్తు—అవిఘ్నమస్తు.

# శివలీలావిలాసము

శ్రీదనరార మ్రొక్కిన గిరీంద్రవరాత్మజఁ జేర్చువేళఁ ద
త్పాదసముల్లసన్నఖరదర్పణవీథులఁ దేజరిల్లు నే
కాదశమూర్తిభేదములఁ గన్నులపండువు సేయుశంభుఁ డా
హ్లాదకరుండు గాచు మన యల్లయదొడ్డనృపాలశేఖరున్.

సీ. ఏనికమోమున నెసఁగుపాపని తల్లి
కొండలరాయని కూర్మిపట్టి
నెలచేరుచుక్క యీాదలఁ దాల్చునేర్పరి
సాటువకెక్కు మిన్నేటిసవతి
మూఁడుచూపులవేల్పు ముదుసలి యిల్లాలు
ముత్తైదువలలోన మొదలిపేరు
కడచదువులయందుఁ గనుపట్టునొక్కటి
వెండిగుబ్బలియింట నుండుపడఁతి

ప్రకటశుభసద్మనిజపాదపద్మనికట
చంచరీకాయమాన చంచదవతంస
కలితగీర్వాణ........................
................దొడ్డవిభుని. 2

చ. అతులమరందబృంద సముదంచితనాభి నవారిషట్పద
శ్రుతులఁ దదంతరస్థితసరోజభవాసన నామకోమల
శ్రుతుల నిజస్మృతు ల్మోదముసొంపునఁ బెంపువహింప మెచ్చున
చ్యుతుఁ డఖిలేశ్వరుండు మనుచు న్దయనల్లయదొడ్డభూవరున్. 3

సీ. నిలుకడఁ దీయంపునలువునఁ దగువాఁడు
జనకుండుగా నుండుచతురవాణి
కలువలఁ దనరాక నలరింపఁగలవాఁడు
తమ్ముఁడుగా నుండుతలిరుఁబోఁడి
యింతుల నెలయింప నెసఁగుపంతమువాఁడు
నాథుండుగా నుండునవలతాంగి
వలపుల వెదచల్లు వన్నెతూపులవాఁడు
తనయుండుగాఁ గలవనజగంధి

వరవికాసచారు వాసనాంభోరుహా
హార్మ్యరమ్యతలవిహారలోల
హృదయకమల కమల యిచ్చుఁగావుత మ్మల్ల
విభునిదొడ్డనృపతి కభిమతములు. 4

ఉ. శ్రేష్ఠతరప్రభావ సవిశేషగుణాద్భుతభావచాతురీ
నిష్ఠను విశ్వభూతగణనిర్మితి నొప్ప ఘటించి లోకబం
హిష్ఠచరిత్రఖేలనమెయిం దగుపద్మభవుండు నిర్జర
జ్యేష్ఠుఁడు గాచు నల్లవరుదొడ్డకుమారనృపాలరత్నమున్. 5

సీ. మహనీయగంధసంబంధగుణంబులఁ
గర మొప్పు వికచపంకజముతోడ
శ్రవణక్రియాదాన సరసభాషితములఁ
బ్రకటిల్లు రాజకీరంబుతోడ
నానాగమార్థనిర్ణయగుంఫనంబులఁ
జదురొందు నూత్నపుస్తకముతోడ
సరిగమపధనిస స్ఫురితస్వనంబులు
వివరించు మంజులవీణెతోడ

మెఱయు శ్రీహస్తములతోడ నెఱసి సకల
భువనపరిపూర్ణవిభ్రమంబునఁ దలిర్చు
చుండు దేవి వాగీశ్వరి యొసఁగుఁగాత
కోర్కు లల్లయదొడ్డనక్షోణిపతికి. 6

క. పూని దివానిశలును భువ
నానీకముఁ గావఁ బ్రోవ నగుభానుసుధా
భానులు హితంబు లిత్తురు
మానుగ నల్లాఖ్యదొడ్డమనుజేంద్రునకున్. 7

సీ. వేల్పులకెల్లఁ దా వేల్పగునొడయండు
పనులయంకిలిఁ దీర్పు ప్రకటులాడు
చదలేటినవతి యచ్చపుఁగూర్మిబిడ్డండు
నెలపువ్వుఁ దల దోపు నెఱకులాఁడు
వణఁకుగుబ్బలిరాచవారికి మనుమండు
ముక్కంటి నలరించుముద్దులాఁడు
పాపజన్నిదము లేర్పడఁ దాల్చుపాపండు
కొక్కుఁబోడెము తోలు టెక్కులాఁడు
గండయుగమండనాఖండగలితలలిత
మదజలాలోలవాచాలమధుపమధుర
గానసుముఖుండు శ్రీభద్రగజముఖుండు
మనుచు నల్లయదొడ్డకుమారవరుని. 8

మ. ఖగముల్ లుబ్ధకుఁ జేసినంత నిజశోకం బుర్విలో నద్భుతం
బుగ సుశ్లోకము దాల్చె నేఘనునిచేఁ బుణ్యార్థసంపాదకం
బగురామాయణ మేసుధీనుతునిచే నారూఢతం బొల్చెఁ బే
ర్మి గడు న్మెఱఁగ నట్టియాదికవి వాల్మీకిం బ్రశంసించెదన్. 9

మ. చతురామ్నాయములున్ జగత్త్రయము మెచ్చన్ వ్యక్తముల్చేసి,త
త్ప్రతిమంబై పొలుపారుభారతము నుత్పాదించి నానాపురా
ణతతుల్ నిర్మలధర్మబోధన ధురీణఖ్యాతి నిర్మించి సం
తతమాహాత్మ్యవిలాసుఁడై వెలయు వేదవ్యాసుఁ గీర్తించెదన్. 10

మ. పటుసమ్మోదమున న్భజింతుఁ గవితాపారీణు బాణు న్సము
త్కట వాణీజలమేఘు మాఘు నుతవిద్యాస్థేము సోము న్విశం
కట విద్యారవి భారవిం జతుర రేఖాభోజుని న్భోజుఁ బ్రి
స్ఫుట లక్ష్మీకరు భాస్కరున్ సతతతేజోభాను భాను న్మదిన్. 11

ఉ. నన్నయభట్టుఁ గావ్యరచనావిదుఁ దిక్కనసోమయాజ న
చ్ఛిన్నమహత్త్వసంవిదితశేముషి నెఱ్ఱయపెగ్గడ న్సము
త్పన్ననవప్రబంధ రసభావకు నింపుగఁ బ్రార్థనాంజలుల్
మున్నుగ నాత్మలోఁ దలఁతు మూఁవుర మూఁవురఁబోలు పుణ్యుల

క. బుధులఁ గమనీయకవితాం
బుధులఁ గళావిదులఁ జారు పూర్ణేందువచో
విధులఁ బ్రణుతింతు నెప్పుడు
నధునాతనకవుల మతిజితాంబరకవులన్. 13

శా. ఆకల్పంబుగ దూర్కరాజకనూరాఖ్యాకుచేత న్సుభ
ద్రాకల్యాణ మనం దనర్చుకృతిరత్నం బొప్పఁ గైకొన్న సు
శ్లోకు న్మత్ప్రపితామహున్ బుధజనస్తోతవ్యదీవ్యద్గుణో
త్సేకుం గంగయసింగనార్యుని దలంతు న్నిర్జరాచార్యునిన్ 14

శా. మాతాత న్విలసద్గభీర కలనామా తాతసాదృశ్యసం
ధాతన్ యాధవనాథనాదజలజాతధ్యాతఁ జిట్టఽంబికా
చేతఃపుష్కరిణీమరాళము నురుశ్రీమూలమున్ మంగళా
న్వీతజానమయాత్మునిం దలఁచెదన్ నిశ్శంకమంత్రీశ్వరున్. 15

కం. మజ్జనకుఁ దత్త్వదర్శిన
ముజ్జనకుని నబ్బసచివముఖ్యునిఁ దలఁతున్
సజ్జన సౌముఖ్యుని ను
దగ్రజ్జయహారినిభుని అంపమాంబావిభునిన్. 16

చ. ఇలఁ జలిచీమరీతి ఖలుఁ డెవ్వరి మర్మములైనఁ బట్టినేఁ
దల దెగిపోవునప్పుడును దా విడువం డవిగావునన్ వృథా
కలన నిరూఢులై బుధులఁ గాఱియఁబెట్టుచు నుండునట్టి పె
ద్దలదెస నేను బోవ;నెడ దవ్వుల నుండి నమస్కరించెదన్. 17

చ తెలుఁగని చెప్ప సంస్కృతవిధిజ్ఞత లేదని,సంస్కృతంబునం
బలుకఁ దెనుంగు నేర రని ప్రాక్తనమార్గమునంద వచ్చినం
గల దది మున్న నంచు నొకకై వడిఁ గ్రొత్తగఁ గూర్చ లేనిపె
ద్దలు పనిగో రటంచు మహిఁ దద్జ్ఞులునాడుదు రల్పధీయుతుల్.

చ. కలితమహాకవీంద్రకృతకావ్యసమర్థపదార్థమర్మముల్
దెలియఁగలేక చీకటియె తెంపుగఁ ద్రవ్వుదు రజ్ఞులౌ కడున్
ములుచలు కొంద ఱట్లయగు ముందట నున్నను బుట్టుఁజీకులు
జ్వలమణిదర్పణాంతరలసత్ప్రతిబింబముఁ గాననేర్తురే? 19

వ. అని క్రమంబున నిష్టదేవతాప్రార్థనంబును బురాణనవీన కవికీర్తనంబును గురుజనాభివాదనంబును ఖలప్రకారనిరూపణంబును సముచితంబుగాఁ జలిపి, ఆత్మగతంబున. 20

కం. ఇల నలఘుకవులు కబ్బం
బులు లక్షలు చెప్పినారు మున్నని నాకు
న్వల దుడుగఁ గావ్యరచనము
చెలఁగి కరులు నడుచుత్రోవఁ జీమలుఁ జనవే ? 21

ఉ. క్రొత్తగ నర్థము ల్దలఁచి గుంఫనశబ్దసులు న్విచిత్రతా
యుక్తత నుల్లసిల్ల నిడి యచ్చట నచ్చట నర్హవర్ణముల్
మెత్తన నూలుక్రొల్పి రసమేళన మొప్పఁగఁ జెప్ప కూరకే
కత్తర బెత్తర ల్పెనఁచి కాఱులు కబ్బము లన్న నవ్వరే. 22

మ. పుర భూపర్తువు లంబుజాప్త హిమరుక్పత్రోదయంబుల్మహీ
ధరమంత్రాహవముల్ వివాహరతియాత్రల్ దూత్యపానాంబుధుల్
విరహాంభోవనలీల లుత్తమరసావిర్భావభావక్రియా
సరణిం జెప్పఁదగున్ బుధుల్గరము మెచ్చన్ సత్ప్రబంధంబులన్

వ. అని తలంచి యుదంచితరచనాచమత్కృతి గలుగ నొక్క
సత్కృతి నిర్మింపఁ దలంపునం దుండుసమయంబున. 24

పావర్ధిష్ణుశుభాన్వితుండవు నుతాపస్తంబ సూత్రక్రమ
వ్యావర్ణీచరణప్రసిద్ధుఁడవు రమ్యార్ధాష్టభాషాకవి
త్వావిర్భావవిధాధురీణుఁడవు కొమ్మామాత్య! నీ విమ్మహిన్.

గీ. చతురుఁడవు పూర్వకవినాథసన్మహాత్వ
మహితుఁడవు సర్వబుధలోకమాననీయ
చరితుఁడవు గాన నింపునఁ జలుపవలయు
పెంపు గల్గఁగ నస్మదభీష్ట మొకఁడు. 26

ఆ. కొడుకు వనము చెఱువు గుడి నిధి నల్లిల్లు
కావ్య మనఁగఁ గీర్తికారణములు
జగతిఁ గలవు సప్తసంతతు లందులోఁ
గరముఁ గీర్తికరము కావ్య మొకఁడ. 27

చ. చెలువుగ భవ్యకావ్యములచేతన యారఘురామముఖ్యు లు
జ్జ్వలముగఁ బెంపు గాంచి గరువంబున మించిరి నాఁడు నేఁడును
గలరు గదా యశోధనులు గావునఁ దత్క్రమమాత్మ నంతయుం
దెలియఁగఁ జూచి యేఁగృతిపతిత్వముఁ బూనఁగఁ గాంక్ష చేసితిన్.

ఉ. వింటిఁ బురాణముల్ గరము వేడుకతోడ ననేకభంగులన్
గంటి కృతార్థతాకలితగౌరవకౌతుక మట్లునయ్యు ము
క్కంటి మహాత్మ్య మేకతము గల్గద యెందు వినంగ రొచ్చుగా
నంటిన సర్గవంశచరితాదులచే నటుగాన నా మదిన్. 29

క. కేవలశివచరితమునే
భావన వినఁగోరుదుం బ్రబంధనిధాన
శ్రీవలరఁగ వినిపింపుము
భావరసాలంకృతాంధ్రభాషాసరణిన్ 30

వ. అని పలికి కర్పూరలంబూజాంబూనదాభరణాదు లొసంగిన నంగీకరించి యే నతనికిట్లంటి. 31

చ. మును కృతు లెంద ఱందఱు సమున్నతి నందరె వార లీగతిన్
ఘనమతి విశ్వపూజ్యమగు కావ్యముమార్గము గన్నవారె నీ
త్రినయనభక్తిపాకము నుదీర్ణవివేకము నింత యొప్పునే
యనఘత నుల్లసిల్లెద వుదారకవిత్వమహత్వసంపదన్. 32

వ. అని సంతసిల్లి యమ్మహానాయకు గృతినాయకుఁ గావించి, తత్ప్రబంధ రచనాభంగి నంగీకరించితి. ♦ 33

♦ నేఁటి కించుమించుగ నిరువదియైదువత్సరముల వెనుక కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తాము తాళపత్త్ర గ్రంథములను సమీకరించు సమయమున తమకు లభించిన శివలీలా విలాసము నీ 31వ వచనము మొదలు రెండాశ్వాసముల గ్రంథమును ముద్రణమునకై ఆంధ్రసాహిత్య పరిషత్తున కందఁజేసి యున్నారు. దానిననుసరించియే పీఠికవలెగా, కథారంభమునుండియు రెండాశ్వాసముల గ్రంథము పరిషత్పత్త్రికాముఖమున నేను ప్రకటించుచువచ్చితిని. శాస్త్రిగారి వలన లభించిన గ్రంథమా నాఁటికే శిథిలమైయున్నది. దానిలోని విషయము నెట్టులో సమీకరించుకొని, నా యోపినంతకు సరిఁజూచి ప్రకటించియుంటిని. పిమ్మట సహృదయశేఖరులయిన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారియొద్ద మూఁడాశ్వాసములు గల యీ శివలీలా విలాసము కలదని తెలిసికొని, వారి నర్థింప వారు దయతో నా

గీ. ఒప్పు గలచోట నొప్పిన నొప్పు మిగులఁ
దప్పు గలచోటఁ దీర్చినఁ దప్పు గలుగ
దొప్పుఁ దప్పుగఁ దప్పును నొప్పు గాఁగఁ
గొనక కవులార నాకృతి వినఁగఁ దగును. ౩౪

క. కృతిముఖతిలకం బనఁ గృతి
పతివంశముఁ బ్రస్తుతింతుఁ దగ భువనహిత
స్థితపురుషోత్తమలీలా
న్వీత(మగు నాక్షీర) జలధి విధమున వెలయున్. 35

ఉ. శ్రీతరుణీశపాదసరసీరుహదేశము...ని
ర్ణీతవిశేషలీల నొకనిర్మలవంశము సంభవించె స
ద్వ్యాతిశయప్రమోదసముదంచితసంచితపుణ్యగణ్యతా
స్వీతవిభూతి నిర్జరధునీజలపూరముతోడి పాడియై, 36

ఉ. అందు జనించి మించిరి సమగ్రనిరూఢిఁ గ్రమక్రమంబునన్
మందరధీరు లాగతసమస్తవి(చారు)లు సంతతప్రజా
నందనకార్యకారులు గుణస్ఫుటహారులు ధర్మరక్షణా
మందవిచారు లంగజితమారులు దేసటు లత్యుదారులై 37

---

తాళపత్త్రప్రతి నా కొసఁగినారు. దానిలోఁ గూడ నచ్చటచ్చట గ్రంథపాతము లేర్పడినను తుదికిఁ దృతీయాశ్వాసము ముగిసినది. దానిని లభించినంతవఱకు ముద్రించి, మిగిలియున్న పీఠికా భాగమును ముద్రింప మొదలిడితిని. శ్రీ శర్మగా రిచ్చిన తాళపత్త్రప్రతిలో పీఠికాభాగమున 32వ పద్యము వఱకు నుండిన భాగము మాత్రమే కలదు. శ్రీ శర్మగారు కూడ తాము ఆంధ్రవిశ్వవిద్యాలయము పక్షమున సంతరించిన రెడ్డి-రాజ్య చరిత్రమున (History of the Reddi Kingdoms) కనుబంధముగ నీ శివలీలా విలాసము పీఠికా భాగమును ముద్రించుచు, రెడ్ల వంశావతారమును దెలుపు భాగమును శ్రీ ప్రభాకరశాస్త్రిగారు పరిషత్తున కొసఁగిన ప్రతినుండియే గ్రహించియున్నారు. ఇఁకమీఁద నా భాగమునే నేనును ఈ తావునఁ గూర్చుచుంటి నని పాఠకులకు మనవి చేయుచున్నాఁడను. ఇంతవఱకు లభించిన ప్రతియొక్కటియే యగుటచే నిది గ్రంథపాత బహుళము కాక తప్పలేదు. సంపాదకుఁడు.

చి. పాపయ్యశాస్త్రి

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

అధ్యక్షులు

ఆంధ్రాస్థానకవి, కవిసార్వభౌమ, మహామహోపాధ్యాయ

శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

ప్రధాన కార్యదర్శి, కోశాధికారి

శ్రీ దంటు భాస్కరరావు.

సహాయ కార్యదర్శి

శ్రీ మువ్వూరి సూర్యనారాయణశాస్త్రి.

కార్యనిర్వాహక సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రి.
2. శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి (బాలవ్యాస)
3. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి (వ్యాకరణవిద్యా,భాషా,ప్రవీణ)
4. శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి (కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర)
5. శ్రీ యండమూరి వేంకటరమణ (మధురకవితావిశారద)
6. శ్రీ బండారు తమ్మయ్య (ఐతిహాసికసమ్రాట్)
7. శ్రీ జయంతి బుచ్చిరామశర్మ.
8. డాక్టరు శ్రీ ఇవటూరి జోగారావు, (యం. బి. బి. యస్.,)
9. శ్రీ చిరువోలు కోటీశ్వరరావు.
10. శ్రీ దామెర రాజగోపాలరావు, బి. ఏ.,

పత్రికా సంపాదకుడు :

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

సంపాదక సహాయులు :

శ్రీ బండారు తమ్మయ్య

---

## శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు

| | | |
|---|---|---|
| 1వ సంపుటము | ... | రు 6—0—0 |
| 2వ సంపుటము | ... | 6—0—0 |
| 3వ సంపుటము | ... | 6—0—0 |
| 4వ సంపుటము | ... | 6—0—0 |
| 5వ సంపుటము | ... | 10—0—0 |
| 6వ సంపుటము | ... | 10—0—0 |
| 7వ సంపుటము | ... | [ముద్రణములో నున్నది] |

## కవిజనాశ్రయము

వేములవాడ భీమకవి విరచితము.

పెక్కు పాఠభేదములతోఁ గూడిన వెనుకటివిషయ మంతయుఁ గలిగి తిరిగి తృతీయముద్రణపీఠికతో ముద్రితమైనది వెల రు 1—50.

## మాధ్యమికకారికలు

బౌద్ధాచార్య నాగార్జున ప్రణీతము. కొల్లూరు సోమశేఖర శాస్త్రి విరచిత సుబోధినీవ్యాఖ్యాసహితము. మూల్యము. రు 2—50.

ఆంధ్రసాహిత్యపరిషత్తు,
కాకినాడ.

Printed by J. Bhaskara Rao at Republic Press Kakinada.
Edited by C. PAPAIAHSASTRY
Published by Andhra SahityaParishat, Kakinada.